తీసుకుని వెళ్ళి దాని విషయంలో జరుపవలసిన వ్యవహారాలన్నీ చెప్పి వాటిని లిఖితమూలంగాకూడా వ్రాసియిచ్చాడు.

ఈవజ్రం చాలా గొప్పది. అపూర్వమైనది. ఇది "పిట్టువజ్రం" అని ప్రసిద్ధిచెందింది. దీనిని ఈపిట్టుగారు ఎలాగ సంపాదించాడో కుమారుడికికూడా చెప్పలేదు. ఇంతటినుంచి, తండ్రికుమారుల జీవితాలలో ఈ వజ్రంయొక్క క్షేమలాభాలే ప్రధానస్థానం వహించినవి. ఈవజ్రాన్ని ఎలా తీసుకుని వెళ్ళవలసినది ఏమిచేయవలసినది తెల్పుతూ పిట్టుగారు 1702 వ సం॥ అక్టోబరు 3వ తేదీన ఒక వివరణపత్రాన్ని వ్రాసి కుమారుడికి ఇచ్చారు. లండనునగరంలోఉన్న సర్ స్టీఫెన్ ఈవాన్సు గారినీ తన కుమారుడు రాబర్టునీ పిట్టుగారు తన ముఖ్త్యారు యేజెంట్లుగా నియమించాడు. తనకు తన భార్యపైన అనేక కోపకారణాలున్నాయనిన్ని అందువల్ల ఆమెయందు తనకు విశ్వాసంలేదనిన్ని ఇకముందు తనవ్యవహారాల విషయంలో ఆవిడను ఎట్టిజోక్యమూ కలిగించుకోనివ్వవద్దనిన్నీ శాసించాడు.

"చాలా అమూల్యమైన వస్తువును నీపరంగా యిచ్చినాను గనుక నీబుద్ధినీ నీయావచ్ఛక్తినీ ఉపయోగించి నీకే అపాయంకలిగినా కూడా దానినిమాత్రం కాపాడాలి. ఒకవేళ దురదృష్టంవల్ల నీవు శత్రువుల చేతులలో పడినట్లయితే నీదగ్గరనున్న కాగితాలన్నీ సముద్రంలో పారవేసి ఆవస్తువును మాత్రం ఏదోవిధంగా కాపాడి రహస్యం బయట పడకుండా ఉంచాలి. నీవు క్షేమంగా ఇంగ్లాండుచేరితే నీవు చేరే మొదటి రేవుపట్నంనుంచి సర్ స్టీఫెన్ ఈవాన్సు గారికిన్నీ ఆల్వారెజ్ గారికిన్నీ చాలా ముఖ్యమైన వ్యవహారం ఉన్నదనిన్నీ ఓడదగ్గరకు రావలసినదనిన్ని ముందుగా వారికి ఉత్తరాలు వ్రాసి వాళ్ళు వచ్చే వరకూ నీవు ఓడదిగకుండా ఉండాలి" అని పిట్టు శాసించాడు. రాబర్టు తమ్ముళ్లైన విలియమును థామస్‌ను మంచిబడిలో వేసి చదివించమనిన్ని కొమార్తెలకు జాగ్రత్తగా చదువు చెప్పించమని తల్లికి చెప్పవలసిందనిన్ని, ఇంగ్లాండులో తన భూములను తోటలను దొడ్లను జాగ్రత్తగా వ్యవహారించవలసిన దనిన్ని తన బంధువులు స్నేహితులు మాటాడేమాటల నన్నింటిని పూసగుచ్చినట్లుగా తనకు తెలియచేయు

వలసినదనిన్ని ఆపత్రింలో వ్రాసి కొమారుడి కివ్వగా అతడు ఆగొప్ప వజ్రాన్ని పట్టుకొని సీమకు బయలుదేరాడు.

ఆదుర్దా

రాబర్టు ఓడమీదకెక్కి వెళ్ళిన ఆరురోజులలోనే పిట్టుగారికి మనస్సు నిలవక కొమారుడికి మళ్ళీ యింకొక ఉత్తరం వ్రాశాడు. ఓడ ఎక్కిన వెంటనే తనకు ఉత్తరం వ్రాయలేదనిన్ని వీలైనప్పుడల్లా ఉత్తరం వ్రాస్తూఉండవలసినదనిన్ని తన పరపతీ క్షేమ లాభాలు కూడా అతడు జాగ్రత్తగా ప్రవర్తించే దానిమీదనే ఆధారపడియుంటా యనిన్ని ఎవరైనా-అనగా స్టీఫెన్‌గారుగాని ఆల్వారెజ్‌గారు గాని ఈ వజ్రంఖరీదు ఎంతో తెలుసుకోవాలని కుతూహలపడి అడిగినట్లయితే దానిఖరీదు షుమారు రు 130000 వరహాలని చెప్పవలసిందనిన్ని ఈ విషయం రహస్యంగా నుంచి జాగ్రత్తగా వ్యవహరిస్తే దీనివల్ల లెక్క లేనంతలాభం వస్తుందనిన్ని నష్టమును కలిగించేటట్టిన్ని అమర్యాదకర మైనట్టిన్ని పెళ్ళిసంబంధం చేసుకోవద్దనిన్ని కూడా కొడుకుకి గట్టిగా సలహా యిచ్చాడు.

1703వ సంవత్సరం జనేవరునుంచి పిట్టుగారు తన కొమారుడి కిన్ని సర్ స్టీఫెన్ ఈవాన్సుగారికిన్ని ఈవజ్రాన్ని గురించిన్ని దానిని సానపెట్టించడం విషయంలోనూ దాచడం విషయములోనూ పుచ్చు కొనవలసిన జాగ్రత్తను గురించిన్ని ఎన్నెన్నో హెచ్చరికలు చేస్తూ ఉత్త రాలు వ్రాయడం ప్రారంభించాడు. వాళ్లదగ్గరనుంచి ఉత్తరాలు ఆల స్యంగా వస్తే విసుక్కునేవాడు. వజ్రం సానపెట్టడానికి సొమ్ముఎక్కువ ఖర్చైనదని కోపించేవాడు. వజ్రాన్ని కోస్తే 280 కారట్లు అవుతా యని వ్రాసియుండి మళ్ళీ 140కారట్లే అవుతాయని వ్రాస్తున్నారేమని అనుమానంతో గోలపెట్టాడు. కోసినముక్కలను కొడుకు ఖర్చులక్రింద అమ్మినాడని వగచినాడు. ఈలోపుగా తన కొడుకు ఒకముసలి ప్రభువు షునమరాలిని పెళ్లాడినాడని తెలియగా చాలా తెలివితక్కువపని చేసినాడని కోపించాడు. భార్యను తిట్టాడు. ఏమైనాసరే ఈ వజ్రాన్ని కారట్టు 1కి 1500 నవరసుల చొప్పున అయ్యేమొత్తముకన్న తక్కువకు అమ్మకూడదని శాసించాడు.

ఈ వజ్రానికి ఎంతమంచి ధరవచ్చినా తాను అన్నదానికి తక్కువ అయితే యివ్వననేవాడు. చివరకు మంచిలాభమే వచ్చినా ఈ వజ్రంవల్ల పిట్టుగారికి చెన్నపట్నంలో ఉన్నంతకాలమున్నూ తరువాత సీమకు వచ్చిన తరువాతనూ కూడా అది అమ్మివేసే వరకూ అతనికి మనశ్శాంతి లేకుండా పోయింది. ఆ వజ్రాన్ని ఎలా సంపాదించాడో దానికథ అలా యుండనిచ్చి దానినిసీమకు పంపడానికి కొడుకుకు వశంచేసినప్పుడు ఆ ఓడ మునిగి పోతుందేమోననిన్నీ అది శత్రువుల చేతనో ఓడ దొంగల చేతులలోనో పడుతుందే మోననిన్నీ కొన్నాళ్ళు ఆదుర్దా పడినాడు. అదృష్టవశాత్తూ ఓడ సీమ చేరిందనీ తన కొడుకు ఆ వజ్రాన్ని జాగ్రత్తగా నమ్మకమైనవారి వశంలో ఉంచాడనీ తెలిసిన తరువాత ఆదుర్దా తగ్గిందికాని కొత్త బాధలు పట్టుకున్నాయి. ఆ వజ్రాన్ని త్వరలో సానపెట్టించకుండా ఆలస్యంచేస్తున్నాడనీ పొదుపుగా ఖర్చు చెయ్యటం లేదనీ తన కుమారుడు తనవ్యవహారాలను-ముఖ్యంగా తన గొప్పవజ్రం యొక్క వ్యవహారాన్ని జాగ్రత్తగా చూస్తూ తాను దఫాలవారీగా చెన్నపట్నాన్నుంచి పంపుతూయున్న వజ్రాల అమ్మకం విషయంలో తగిన శ్రద్ధ వహించడానికి బదులుగా తనకొడుకు కాముక వ్యాపారంలో పడినాడని బాధపడ్డాడు. తన ముఖ్యాగు సర్ స్టీఫెన్ ఈవాన్సుకూడా ఆతడు నిర్వహించ వలసిన పనులను మంచివ్యవహారత చేయవలసినట్టు చేయడం లేదనిన్ని తన పనులు చూడడానికి అతనికి తగిన శరీరారోగ్యం లేదనిన్నీ పిట్టుగారికి తోచింది.

ఇలాగ పిట్టుగారికి క్రమ క్రమంగా తీవ్రమైన మనోవ్యథ కలిగింది. తన కొడుకుకి వ్రాసే ఉత్తరాలలో అతని అసంతృప్తి మనోవ్యథ పూర్తిగా కనపడేవి. ఇలాంటిస్థితిలో అతడు చెన్నపట్నంలో తన ఆలోచన సభ(కవున్సిలు)లో శాంతంగా ఎలా పనిచేయ గలుగుతాడు? ఆతడు ఎప్పుడూ తనతోడి వారి మనస్సులకు నొప్పి కలిగిస్తూ యుండే వాడు. వారుకూడా అతనిపట్ల విరోధించి కంపెనీ డైరెక్టర్లకోర్టు వారికి అతనిని గురించి అనేక సంగతులు వ్రాసేవారు.

## ఇంకా కొన్ని వజ్రాలు

పిట్టు తన కొమారుడికి 1706 వ సంవత్సరం జనేవరి 16వ తేదీన వ్రాసిన ఉత్తరంలో తాను సెప్టెంబరులో ఇంగ్లాండుకు రావాలను కుంటున్నాననిన్నీ, అయితే చెన్నపట్టణం ప్రభుత్వాన్ని ఫ్రేజరు మొదలైన వారిచేతులలో వదలిపెట్టడం తన కిష్టంలేనట్టున్నూ వ్రాశాడు. 2570 వరహాలు పెట్టి తాను కొన్ని వజ్రాలను కొన్నా ననిన్నీ, వాటిని పంపించినానననిన్నీ, వాటిలో పెద్దరాయిలో ఒక్కపక్క పసుపురంగు ఉన్నదని భయపడి ఒకకంత కొట్టించినాననిన్నీ, దానిలో నీరు సరిగా ఉంటే దానికి సానపెట్టిస్తే 2500 లేక 3000 నవరసులు ఖరీదు చేస్తుందనిన్నీ, అది పసుపువన్నెగాఉంటే రెండు రోజాలుగా తయారు చేయించి లాభానికి అమ్మి సొమ్మును పార్లమెంటు ఫండులో వడ్డీకి వేయవలసిందనిన్నీ, వ్రాశాడు. తన గొప్ప వజ్రం యొక్క వ్యవహారంచాలా రహస్యంగా జరిగించాలనికూడా వ్రాశాడు. మళ్ళీ పదిహేను రోజులలో వ్రాస్తూ 2100 వరహాలకు 8 మెంగెల్లీనుల (Mangaleens) వజ్రం ఒకటి కొన్నాననిన్నీ, లోపం ఏమీ లేదనిన్నీ, దానిని రెండువేల నవరసుల కమ్మవలసినదనిన్నీ వ్రాశాడు. ఇదిగాక సోమర్సు అనే ఓడ మీదవచ్చే వజ్రం తాను హిందూదేశంలో చూచిన వజ్రాలన్నింటి లోనూ స్వచ్ఛమైనదనిన్నీ, గడబిడ చెయ్యకుండా యీ వ్యవహారం నిర్వహించ వలసిందనిన్నీ, ఇలాంటి వజ్రం ఇదివరకు నాలుగువేల నవరసులకు అమ్ముడు పోయినదనిన్నీ, అది క్షేమంగా నీకుచేరి, మంచి లాభం వస్తుందని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ ఉన్నాననిన్ని వ్రాశాడు.

1706 వ సం॥ సెప్టెంబరు 22 వ తేదీన పిట్టు వ్రాసిన ఉత్తరం వల్ల ఆయన మనస్సులో ఎంతబాధగా నున్నదో కనబడింది. తన కొడుకు అనవసరంగా చాలా సొమ్ము ఖర్చు పెడుతున్నాడని విని తిట్టి పోశాడు. ఓల్డు సారం స్థానంలో పార్లమెంటులో ప్రవేశించడానికి అతను సొమ్ము ఎందుకు ఖర్చుపెట్టాలని ఆయనకు కోపంవచ్చింది. తన పద్ధతులు మార్చుకోకపోతే తన పిల్లలకు తనసొమ్ము ఒకదమ్మిడీయైనా యివ్వనని ఖచ్చితంగా వ్రాశాడు. "మీరు మనుష్యులా? పశువులా" అని నిందించాడు. ఇంకొక ఉత్తరంలో తన కుటుంబంలో అందరూ

పోట్లాడుకుని చస్తూవున్నట్లు తనకు తెలుస్తూవున్న దనిన్నీ తానుఇలాగ దేశాంతరంలో మగ్గిపోతూవుంటే వాళ్ళందరూఇంట్లోసుఖమనుభవిస్తూ వున్నారనిన్నీ, తాను ఇన్ని కష్టాలు పడిసదీ తన పిల్లలకు కొంత ఆస్తిని సంపాదిద్దామనే ననిన్ని, ఎన్నడూ అనుకోని అవకాశం కాస్త కలిగిందని సంతోషిస్తూవుంటే దరిద్రురాలైన భార్యవల్లను ఈ బిడ్డల వల్లను అది నాశనం అయ్యేటట్టు కనబడుతూవున్న దనిన్నీ, వారి ఉత్తరాలనుబట్టి ఇంటిని ఒక నరకకూపం కిందచేసినట్టు కనబడుతూ వున్నదనిన్ని వ్రాశాడు. అయినా చివరమాత్రం ప్రతి ఉత్తరంలో వ్రాసేటట్లే మళ్ళీ తన ఆస్తిని గురించి చేయవలసిన పనులను ఉదాహరించాడు. తన భూములలో పాతడానికి నీలైనన్ని చెట్లను పాతించమన్నాడు.

ఈ పిట్టు వజ్రం చూసినవారూ దాని సంగతి విన్నవారూ చాలా ఆశ్చర్యపడుతున్నారని కొడుకు వ్రాసిన మాటలవల్ల పిట్టుగారికి భయమూ అనుమానమూ ఎక్కువ అయినవి. దీని సంగతి ఇంత మందికి ఎందుకు తెలియాలని ఆయనకు కోపం వచ్చింది. ఏమైనాసరే తా నిదివరకు అన్నదానికన్న తక్కువకు అమ్మదలచ లేదనిన్నీ వెంటనే దానిని ఇనుప పెట్టెలోపెట్టి తాళం వెయ్యవలసిందనిన్నీ ఒకతాళం తన వద్ద ఉంచుకోవలసిందనిన్నీ తాను వచ్చేవరకూ ఎవరికీ చూపించవద్దనిన్నీ గట్టిగా వ్రాశాడు.

ఆ వజ్రం లోకులకు ఆశ్చర్యం కలిగిస్తూవుంటే తనకుటుంబంలో కలిగిన కల్లోలం కూడా లోకులకు ఆశ్చర్యం కలిగిస్తూవున్నదని కుమారుడికి వ్రాశాడు. తన కొమారుడు వ్రాసినట్టుగా ఆవజ్రాన్ని గురించి ప్రతివాళ్ళు మాట్లాడేటంత అజాగ్రత్త వహించినందుకు పిట్టుగారు కోపించారు. దానిని కొయ్యడానికి ఖర్చు ఎక్కువ అయిందనీ ఎత్తు తగ్గిందనీ గోలపెట్టారు. ఆ వజ్రాన్ని గురించి తాను ఎక్కడా ప్రచారం చెయ్యడం లేదనిన్ని చెన్నపట్నంనుంచే దానిని గురించిన వర్తమానాలు అందరికీ తెలుస్తున్నాయనిన్నీ ఒకవందమంది దానిని గురించి తనను ప్రశ్నించి వున్నారనిన్ని రాబర్టు తన తండ్రికి వ్రాశాడు.

1707 సంవత్సరం ఫిబ్రవరినెలలో పిట్టుగారు మళ్ళీ తన

కొమారుడికి కొన్ని వజ్రాలను పంపించాడు. ఆవజ్రాలన్నీ చాలా మంచివనిన్నీ అందులో ప్రతీదీ కాంతిమంత మైనదనిన్నీ కాలాన్ని బట్టి ఆలోచిస్తే వాటి ఖరీదుకూడా ఎక్కువకాదనిన్నీ ప్లూమర్ (Plumer) అనే దుర్మార్గుడు ఈ వజ్రాలకు ఇంగ్లాండులో నున్న గొప్పధరలను ఇక్కడివారికి చెప్పి వృథాగా ధరలు పెంచినాడనిన్ని వ్రాశాడు. ఈ వజ్రాల బంగీలు విప్పేటప్పుడు జాగ్రత్తగా కనిపెట్టి ఉండవలసినదనిన్ని కొందరు దుర్మార్గులు రాళ్ళను మార్చివేస్తారనిన్నీ కొమారుడిని హెచ్చరించాడు.

కంపెనీ డైరెక్టర్లు మొదట నిర్ణయించిన ఉద్యోగకాలం అయిదేళ్ళూ పూర్తి అయిపోయినా ఏదో కారణంవల్ల పిట్టు ఇంకా గవర్నరు ఉద్యోగం చేస్తూనే ఉన్నాడు. వీలైనప్పుడల్లా లాభసాటిగా వజ్రాలను ఖరీదు చేస్తూ ఇంటికి పంపిస్తూనే వచ్చాడు. 1707 ఫిబ్రవరి నెలలోనే సర్ స్టీఫెన్ ఈవాన్సుగారికి తన కొమారుడికీ కూడా కొన్ని వజ్రాలను పంపించాడు. వాటిలో 61 మెంగిలీనుల ఎత్తుగల గొప్ప వజ్రం ఉండియున్నది. అది పదివేల నవరసుల ఖరీదు చేస్తుందని పిట్టుగారే వ్రాశారు. తన పెద్దవజ్రాన్ని కొనే రాజులు ఐరోపా దేశంలో ఎవరెవరున్నారో అని పిట్టుగారు ఎల్లప్పుడు ఆలోచిస్తూనే వున్నాడు. దాని ధరమాత్రం తగ్గించనన్నాడు.

1708 సంవత్సరం సెప్టెంబరు నెలలో 650 వరహాలకు మళ్ళీ కొన్ని వజ్రాలనుకొని పంపించాడు. తన పెద్దవజ్రాన్ని ఇంగ్లాండు బ్యాంకువారి ఇనుపపెట్టెలో పెట్టించి వుంచవలసినదనిన్నీ అత్యావసరమైతేగాని దానిని ఎవరికీ చూపించవద్దనిన్నీ మోసములు జరుగుతాయనిన్నీ మరీమరీ హెచ్చరించాడు.

1707 మొదలు 1708 వరకూ పిట్టుగారు ఇలాగున వ్రాస్తూనే వున్నారు. ఆఖరికి 1709 సెప్టెంబరు 17 వ తేదీన ఉద్యోగాన్ని గవర్నరు కవున్సిలు సభ్యుడైన అడిసనుగారికి ఒప్పగించవలసినదని పిట్టుగారికి తాకీదు వచ్చింది. పిట్టుగారు 21 తేదిన తన వుద్యోగాన్ని వదిలి అడిసనుగారికి వప్పగించాడు గాని లెక్కలున్నూ సగదున్నూ వప్పగించక పూర్వమే అడిసనుకు జబ్బుచేసింది. జబ్బులోనే అవి వశంచేసు

కొన్నాడు. పిట్టు అక్టోబరు 17 తేదిన బైలుదేర బోతూవుంటే అడిసను చనిపోయాడు. అందువల్ల పిట్టు ఆ రోజున ఆగి 21 తేదిన బైలు దేరాడు. అడిసను తరువాత చెన్నపట్నం పరిపాలన తన విరోధి యైన ఫ్రేజరు చేతుల్లోకి తాత్కాలికంగా నైనా రావడం పిట్టుకు ఇష్టం లేదు.

అడిసను గవర్నరుగాఉన్న 29 రోజులలోనే గవర్నరుగారి కవున్సిలుకు పిట్టుపైన ఒకఫిర్యాదు వచ్చింది. కవున్సిలు సభ్యులైన విలియం ఫ్రేజరున్నూ తామస్ ఫ్రెడరిక్కున్నూ నూరప్పఅనే ఒక దేశీయ వర్తకుడున్నూ కలిసి ఈపిట్టుగారు చాలా అన్యాయంచేసి ఒక మహావజ్రాన్ని సంపాదించాడని కవున్సిలులో ఒక మహజరు దాఖలుచేశారు. ఈమహజరును గురించి తరువాత పిట్టుగారు తన మరణశాసనంలో ఉదహరించినందువల్ల ఇలాంటిది వచ్చినట్లు బయట పడింది కాని లేకపోతే ఇది వున్నట్లే బయటపడేదికాదు. ఇప్పటికి కూడా ఈఅర్జీ యేమైనదీ తెలియదు. పిట్టుగారే దానిని నశింపు చేయించాడేమో నని కొందరి అభిప్రాయం. ఇందుకోసమే కొన్నాళ్లు ఆగినాడని అంటారు.

పిట్టుగారు 1710వ సంవత్సరములో శరత్కాలంలో ఇంగ్లాండు చేరాడు. తన దేశం వదలిపెట్టి పదమూడేండ్లయినది. ఈమధ్యలో అతడు చాలా భాగ్యవంతుడైనాడు. అతడు లండను నగరముచేరగానే తూర్పు ఇండియా కంపెనీవారి డైరక్టరు కోర్టువారి కోరికపైన వారి సభకు హాజరైనాడు. మొగలుచక్రవర్తిగారికి చెందవలసిన అపూర్వమైన ఒకగొప్ప వజ్రం పిట్టుగారిదగ్గర నున్నదనిన్నీ దానిని వెంటనే మొగలుచక్రవర్తిగారికి పంపించ వలసినదనిన్నీ, కర్నాటక నవాబు దివాన్ సాదతుల్లాఖానుగారు వ్రాసిన ఒకజాబునకు తర్జుమా ఒకటి జతపరుస్తూ చెన్నపట్నం సెంట్ జార్జి కోటలోని కంపెనీవారి కవున్సిలు అధ్యక్షుడి దగ్గరనుంచి తమకు ఒకఉత్తరం వచ్చినదనిన్నీ సాదతుల్లా ఖానుగారి ఉత్తరంలోని సంగతులు తమకు అర్థం కానంత తికమకగా ఉన్నవనిన్నీ అయితే ఆవజ్రాన్ని వెంటనే మొగలుచక్రవర్తికి పంపించ

వలెనని అతడు కోరుతున్నాడనే సంగతిమాత్రం తమకు స్పష్టపడిన దనిన్నీ కోర్టువారు చెప్పి అతనిని సంజాయిషీ అడిగారు.

అంతట పిట్టుగారు ఇదంతా చెన్నపట్నంలో తన విరోధులు కుట్రచేసి వ్రాయించారనిన్నీ అందులో కెప్టెన్ సీటన్ ఒకడనిన్నీ తాను గొప్పగొప్ప వజ్రాలను కొన్నట్లుగా తక్కిన దేశీయులకు కొండెములు చెప్పినట్లు తనకు ఇదివరకే తెలిసినదనిన్నీ కంపెనీ డైరక్టర్ల కోర్టువారికి జునవి చేశాడు.

పిట్టుగారి సంజాయిషీ పత్రం

పిట్టుగారు సీమకు తిరిగిరావాలని బయలుదేరిన ఓడ దక్షిణా ఫ్రికాతీరాన్ని ఉన్న గుడ్‌హోప్ అగ్రానికి వచ్చేటప్పటికే చాలా ఆలస్యం అయి ప్రయాణం ఇంకా ఆలస్యం అయ్యేటట్లు తోచినందు వల్ల పిట్టుగారు తిన్నగా లండనుకుపోకుండగా నార్వేదేశంలో బెర్గ నుకు పోయే ఓడమీద ఎక్కివచ్చి 1710 మే 30 తేదీన బెర్జెనుచేరాడు. పిట్టుగారు అక్కడ నున్నకాలంలో ఒకవేళ తాను ఆకస్మిక మరణం పొందేయెడల తనకొమారుడి కివ్వగలందుల కని పిట్టు వజ్రమును తానుసంపాదించిన కథనుగురించి ఒక సంజాయిషీ వ్రాసియుంచడం మంచిదని కాబోలు అందులో ఇల్లాగ వ్రాశాడట.—

''నేనీ బెర్జను అనే ప్రదేశానికి వచ్చినప్పటినుంచీ నా మన స్సులో చాలా బాధగావుంది. విలియం ఫ్రేజరున్నూ, తామస్ ఫ్రెడ రిక్కున్నూ, నల్లవర్తకుడైన సూరప్పయున్నూ చెన్నపట్నంలో కవు న్సిలు సభాయుతుడైన గవర్నరు అడినను ఎదుట నామీద ఒకఫిర్యా దును దాఖలుచేశారు. నేను ఒక అపూర్వమైన వజ్రాన్ని అన్యాయం చేసిసంపాదించానని అందులో వ్రాశారు. దీనివల్ల నాకు చాలాపరువు నష్టము కలిగింది. నా ఆ స్తికి పరపతికికూడా భంగం కలిగే టట్టు తోచింది. అందువల్ల ఆ వజ్రాన్ని నేను ఎలాగ సంపాదించినదీ వ్రాసి నా దగ్గర వుంచుకోవడం మంచిదని తోచింది. ఒకవేళ నేను ఆకస్మి కంగా చచ్చిపోతే నా పిల్లలూ, స్నేహితులూ యథార్థము తెలుసుకుని దుర్మార్గుల నోళ్ళు మూయించడానికి వీలవుతుందని కూడా ఇది

వ్రాశాను" అని ప్రారంభించి తాను వ్రాసినదంతా యథార్థమని ఏసుక్రీస్తుమీద ప్రమాణం చేశాడు.

పిట్టుగారు చెన్నపట్నం చేరిన రెండు మూడేళ్ళలో ఆ దేశంలో చాలా పెద్దవజ్రా లున్నాయని తాను విన్నాననిన్నీ తాను కొంటానని తనవద్దకు తెమ్మని వర్తకులను ప్రోత్సహించి నాననిన్నీ అంతట జామ్‌చందున్నూ ఇంకా యితర వజ్రాల వర్తకులున్నూ 1701 డిశంబరు ఆ ప్రాంతంలో తన వద్దకు 305 మంగెలీనుల ఎత్తుగల ఒక పెద్ద రాయినిన్నీ మరికొన్ని చిన్న రాళ్ళున్నూ పట్టుకొని వచ్చారనిన్నీ మొదట అంత పెద్ద ఖరీదుగల రాయి తాను పుచ్చుకో దలచ లేదు గాని ఆ వర్తకులు చాలాసార్లు వచ్చారనిన్నీ రెండు లక్షల వరహాలకు తక్కువ అయితే యివ్వమని వాళ్ళున్నూ ముప్ఫైవేలకన్నా ఎక్కువ యివ్వనని తానున్నూ ఊగులాడినామనిన్నీ జామచందు తనతో కలిసి వచ్చే వెంకటసెట్టి అనే వర్తకుడితో కలిసి 1702 ఫిబ్రవరిలో మళ్ళీ తన దగ్గరకు వచ్చి తాను త్వరలో ఈ దేశానికి పోదలచినా ననిన్నీ ఆ రాతిని ఒక లక్షవరహాల కిచ్చివేస్తానని చెప్పినాడనిన్నీ అతడిని కొన్నాళ్లైన తరవాత రమ్మని తాను చెప్పి కిందపెట్టే మీదపెట్టి బేరం చేయగా ఆఖరికి 55 వేల వరహాల కిస్తానన్నాడనిన్నీ తాను 45 వేలకు మొగ్గినాననిన్ని అంతకంటె తాను ఎక్కువ యివ్వదలచక తన దగ్గరవుంచిన ఆవజ్రాని వాళ్ళకు ఇచ్చివేయబోతూ వుంటే మళ్ళీ బేరము పొసిగినందువల్లీ ఆఖరికి తాను 48 వేల వరహాలిచ్చి అవజ్రాన్ని కొన్నాననిన్ని పిట్టు వ్రాశాడు.

"ఈ జామచందుతో నేను చాలా బేరాలు చేశాను నేను వచ్చేటప్పుడు అతని దగ్గర రెండు వేలవరహాలు అట్టే వుంచాను నేను ఏదైనా అన్యాయం చేసివుంటే నా సొమ్ము అతనిదగ్గర ఉన్నప్పుడు అతడు బిగపట్టకుండా వుంటాడా? తరవాత నేను అతడిని నక్ష్మ వాడినా?" అని కూడా పిట్టు 1710 జూలై 29 వ తేదిన వ్రాసిన ఆ వింత మరణశాసనంలో ఉదాహరించాడు. అంతే గాని, తన ఆస్తిని గురించి జరగవలసిన ఏర్పాటులేవీ ఆ కాగితంలో లేవు! అందువల్ల ఇది కేవలమూ వజ్రాన్ని గురించి వ్రాసిన సంజాయిషీపత్రమే!! ఈ

సంగతులన్నీ డైరక్టర్లు కోర్టువారికి తప్పకుండా పిట్టు చెప్పి ఉంటాడు. వారు అతనిమాటలు విశ్వసించి తమవద్దకు వచ్చిన ఉత్తరాన్ని ఉత్తర ప్రత్యుత్తరాల ఉపసంఘము, (కమిటీ ఆఫ్ కరెస్పాండెన్సు) వారికి పంపించారు. పాదతుల్లాఖాన్‌గారు వ్రాసిన ఉత్తరంయొక్క అంతరార్థం డైరక్టర్లలో కొంతమందికి అర్థంకావడం లేదనిన్నీ చెన్నపట్నం కవున్సిలులో ఉండేవారిలో కెప్టెన్ సీటనుగారికి మద్దతు చేసేవారికేమైనా తెలియ వచ్చుననిన్నీ ఆ కమిటీవారు జవాబువ్రాసి పంపారు. అంతటితో ఈ వ్యవహారం బుట్టదాఖలైంది. పైనవ్రాసిన సంగతులను బట్టి పిట్టుగారు చెప్పిన సంజాయిషీలో ఈ సీటన్‌కు సంబంధించిన సంగతి ఏదో ఉన్నదని స్పష్టం అవుతూ ఉందికదా!

## సీటన్‌గారు మోపిన నిందలు

ఈ కెప్టెన్ సీటన్ పిట్టుగారిమీద చాలా నేరాలు చెప్పినట్లు చెన్నపట్నరి గవర్నరు కవున్సిలు రికార్డులలోనే ఉన్నది. ఇతడు1685లో హిందూదేశానికి వచ్చాడు. ఇతడు కయ్యాళీమనిషి. పైగా కొంచెము త్రాగుబోతు కూడాను. అందువల్ల కొంతమందితో పోట్లాడి చిక్కులు తెచ్చుకున్నాడు. చెన్నపట్నంలో పిట్టు గవర్నరుగా ఉన్నప్పుడు అతని ఆలోచన సభలో సభ్యుడుగా ఉండిన థామస్ ఫ్రెడరిక్కు ఇతని అల్లుడు. పిట్టుగారు పెద్ద వజ్రాలను కొన్నాడని దేశీయుల కందరికిసీటను చెప్పినట్లు పిట్టుకు తెలిసింది. ఈ సీటను తననుగురించి చాలా అన్యాయపు సంగతులు కలిపించి చెప్పుతున్నాడనిన్నీ క్రిందటిరోజున తాను పిలిపించి అడిగితే అతడు ఘోరమైన అబద్ధాలు ఆడినాడనిన్నీ 1709లో పిట్టుగారు తన కవున్సిలువారికి తెలియపరిచి తనకూ ఈసీటనుకూ జరిగిన సంభాషణను గురించి ఈ కింద వివరణ పత్రాన్ని దాఖలు చేశాడు.

"ఈ రోజు అగష్టు 2 వ తేది సాయంత్రం 5 గం. వేళ నేను నా ఆలోచన మందిరంలో కెప్టెన్ సీటనుతో మాట్లాడాను. పాపయ్యను ప్రధాన దుబాషీగా చెయ్యడానికి నేను 600 వరహాలు లంచంపుచ్చుకున్నానని నీవు అన్నావట ఎందుకు అన్నావని నేను అడిగాను. తాను ఆలా అన్నమాట నిజమేననిన్నీ మీరు ఏమి చేసినా ఏమి



మాట్లాడినా మీనౌకరులు బయట పెడుతూవుంటారనిన్నీ మీకు యెవ్వడూ స్నేహితుడు లేడనిన్నీ అతడు నాతో అన్నాడు. నేనువేమి కొంటున్నానో, ఏమి అమ్ముతున్నానో నీకెందుకు? నీకు ఎలా తెలుసు? అని అడిగితే దానిని గురించిన సమాచారాలన్నీ తనకు ఎప్పటికప్పుడు తెలుస్తూవుంటాయని చెప్పి కావలిస్తే కొన్ని ప్రశ్నలడుగు తాను జవాబు చెప్పండి. అని నన్నీ ప్రశ్నలడిగాడు.

ప్రశ్న. మీరు కొన్న ఒక పెద్ద వజ్రంలో తనకు భాగంఇవ్వమని రాబర్ట్సు మీకు వ్రాశాడా లేదా?

జవాబు: అబద్ధం,

ప్రశ్న. ఆ వజ్రం యాభై వేల డాలర్లకు విక్రయించినందుకు ఒకాయనవచ్చి మిమ్మలను అభినందించాడా లేదా?

జవాబు: అబద్ధం.

ప్రశ్న. ఒక పెద్ద వజ్రాన్ని ఇచ్చివేయ వలసిందని అడగడానికి మీదగ్గరికి దక్షిణాపథాన్నుంచి ఇద్దరు ఆసామీలు వస్తే మీరు ఒకడికి 15 రూపాయీలు ఇంకొకడికి 150 రూపాయిలు ఇచ్చి పంపారా లేదా?

జవాబు: అంతా అబద్ధం. ఒక్క మనిషే వచ్చాడు. అలాగ వచ్చిన దుర్మార్గుడిని నేను బాగా తిట్టి పంపాను.

ఈ సంభాషణజరిగిన తరువాత ఈ సీటను నన్ను మోసగించడానికి ప్రయత్నించినట్లే గవర్నమెంటును కూడా ఇతడు మోసగింప గలడని తోచి గార్డుల కెప్టెనును పిలిపించి సీటనును ఎన్ సైస్ గదిలో పెట్టి ఉంచవలసిన దనిన్నీ కవున్సిలు వారిని తప్ప ఇంకెవ్వరినీ అక్కడకు రానివ్వవద్దనిన్నీ ఉత్తర్వు చేశాను. పిట్టుచేసిన ఫిర్యాదును గురించి విచారించడానికి కవున్సిలువారు సీటనును పిలిపించారు. వారు ఏమీ అడగకుండానే ఈ కంపెనీవారికి నష్టకరంగా ఈ పిట్టు ఒక గొప్ప వజ్రాన్ని కొన్నాడనే నేరం మోపడానికి తాను వచ్చాను అనిన్నీ, ఈ వ్యవహారం తప్పీళ్ళన్నీ తనకు పూర్తిగా తెలుసు ననిన్నీ మళ్ళీ వచ్చేనెలలోనే పిట్టుగారు గవర్నరుపదవి మానుకొని కొత్తగవర్నరు వస్తాడు గనుక ఈ పిట్టుగారు తనను గురించి ఏమన్నా తనతో ఏమి

# విషయసూచిక







# కథలు-గాథలు

## (రెండవ భాగము)

## "అంకుల్ టామ్" కథ

నీగ్రోబానిసల ఘోరస్థితిగతులను తెలుపుతూ ఈయన్యాయమును బాపుటకు తోడ్పడిన గ్రంథములలో 'అంకుల్ టామ్స్ కేబిన్' అనే ఇంగ్లీషునవల సుప్రసిద్ధమైనది. హేరియట్ బీచర్ స్టౌ అనే అమెరికా దేశపునారీరత్నము దీనిని రచించి 1852 లో ప్రకటించినది. ఇది చాలా భాషలలోని కనువదింప బడి రమారమి యొక కోటి ప్రతులు ప్రకటింపబడినవి. పదిహేనులక్షల రూపాయలు వ్యయపరచి ఈ కథను అమెరికావారు సినిమాఫిల్ముగా చేసి ప్రదర్శించుతూఉన్నారు.

అమెరికాఖండమునందు నేడు తెల్లవారు గొప్ప నాగరక రాజ్యములను స్థాపించి సౌఖ్యము ననుభవిస్తూ ఉన్న సంగతి అందరూ ఎరుగుదురు. పదునైదవ శతాబ్దికిబూర్వ మీా అమెరికాదేశములో తెల్లవారు లేరు. దేశమున పాడిపంటలు లేవు. అక్కడి ఆదిమ వాసులు ఎఱ్ఱని దేహచ్ఛాయగల వీరజాతివారు. వీరిని పాశ్చాత్యులు ఎఱ్ఱయిండియనులని వ్యవహరించేవారు. వీరి కొకవిధమైన నాగరకత, మర్యాద, జీవన విధానము ఉండేవి. వారు మన దేశములోని కోయదొరల లాగ ఉండేవారు. అమెరికాదేశమును కనుగొని తెల్లవారక్కడ వలసనెలకొని బంగారుగనులు త్రవ్వుతూ పాడిపంటలను వృద్ధిచేసి లాభము పొందసాగినారు. వారి కీ పనులు చేసేటందుకు మనుష్యులు కావలసియుండిరి. అక్కడి ఎఱ్ఱజాతివారు ఒళ్ళు వంచి పనులు చేయరు, పైగా వారు శూరులు. మన దేశములో లాగ అక్కడి తెల్లవారికి చౌకగా కూలినాలి చేసేవారు లేకపోయారు. తెల్లవా రిది చూచి ఒకమార్గము కనిపెట్టారు. ఆఫ్రికాదేశములోని నీగ్రోజాతివారు దృఢకాయులు, వారి యాకారము వికృతముగానున్నప్పటికీ హృదయములు కోమలములు. వారికి పెక్కు పిచ్చినమ్మకము లున్నను పరమేశ్వరునందు భయభక్తు

అన్నా తనకులెక్క లేదనిన్నీ సీటను అన్నాడు. పిట్టును గురించి ఇంకా కొన్ని నేరాలు చెప్పాడు. అవన్నీ అబద్ధమని పిట్టుగారు అన్నారు. అంతట టనును రిమాండుచేసి ఖయిదులో ఉంచారు గాని,

మరుసటివారంలో అతనిని మళ్ళీ కవున్సిలువారి ఎదుటకు పిలిపించారు. అప్పుడు ఆ సభకుపిట్టుగారే అధ్యక్షుడు. ఇంకా అక్కడ ఆరు గురుసభ్యు లున్నారు. ఆ సభవారి 'కన్సల్టేషను' అనే సభ కార్య క్రమ వివరణను గవర్నరే వ్రాసినట్లు కనబడుతుంది. అందులో ఇలాగ ఉంది:—

2 వ తేదీన గవర్నరుతో అతడు అన్నసంగతులను ఆ మర్నాడు గవర్నరు ఎదటను కవున్సిలు ఎదటను అతడు అన్నమాటలున్నూ అత నికి చదివి వినిపించి ఆ నేరాలు రుజావుచెయ్యవలసిందని అడిగితే తాను గవర్నరుతోనూ కవున్సిలుతోనూ ఏమీ అనలేదని అబద్ధం ఆడాడు! ఇంకెవ్వరైనా ఇలాగ ప్రవర్తిస్తే మాకు ఆశ్చర్యంగా ఉండేదిగాని ఇతన్ని బాగా ఎరిగి వున్నందువల్ల ఇతడు ఎంత దుర్మార్గానికైనా తగి నవాడని మాకు ధృవమైంది. ఈ ఖయిదీచేసిన ఇంకా కొన్ని నేరా లను నిరూపిస్తూ గవర్నరు రెండు ఉత్తరాలను చూపించాడు. ఇంకా ఏమైనా చెప్పుకుంటావా అని అతణ్ణి మేము అడిగాము. చెప్పుకునేది ఏమీ లేదని అత డన్నాడు. అతడు వెళ్ళుతూ తనపైనమోపిన నేరా లేమీ తాను చెయ్యలే దన్నాడు. ఇతడు చెయ్యని దుర్మార్గం లేదు. ఈ పట్నానికి చాలా కాలంనుంచి ఇతడొక మహామ్మారిలాగ ఉన్నాడు. ఇతనివల్ల చాలామందికి అన్యాయం కలిగింది. శాంతికి భంగం కలిగింది. అంతటితో తృప్తిచెందక గవర్నరుకూ ఈ బస్తీవ్యాపారానికి కూడా నష్టంకలిగించడానికి ప్రయత్నిస్తున్నాడు" అని వ్రాసి అతనిని ఖైదులోనేవుంచి ఇంగ్లాండుకుపోయే మొదటి ఓడలో పంపివేయడానికి ఏకగ్రీవంగా తీర్మానించారు.

కొద్దిరోజులలోనే పిట్టుగారిని ఉద్యోగం వదలి సీమకు రమ్మనే వుత్తర్వులతో హీత్కోటు అనేఓడవచ్చింది. ఆఓడలో సీటనుకూడా నిర్బంధంలో ఉంచి సీమకు పంపివేయడానికి కవున్సిలువారు నిశ్చయించారు. సీటను తనంతటతాను ఇంట్లోనుంచి రానన్నాడు. అంతట

కొందరు సైనికుల సహాయంతో బలవంతంగా ఒకపడవమీద ఎక్కించి ఓడదగ్గిరకు పంపించారు. సీటను ఓడ నెక్కనని నిరాకరించాడు. ఓడలోకి ఎక్కించడానికి సహాయం చెయ్యవలసిందని ఓడకెప్తానును కోరగా ఓడ నెక్కడానికి ఇష్టపడనివాళ్ళను తాను బలవంతం చేసి ఎక్కించుకోనని నిరాకరించాడు. సముద్రంమీదనున్న ఓడలో కెప్తానే సర్వాధికారిగనక చేసేదిలేక సీటను ఎక్కినపడవ మళ్ళీ వెనక్కివచ్చింది. ఈరాజధానిలోనుంచి బయటికి పోవడానికి నీవేలగిన ఏర్పాట్లు చేసుకోమని కవున్సిలువారు సీటనుకు సెలవిచ్చారు.

## పిట్టుగారి అంత్యదశ

పిట్టుగారు ఇంగ్లాండుకు వచ్చిన తరువాత మొదటిజార్జిరాజుగారి నీ, ఆయన కొమారుణ్నీ దర్శించి వారికి తన వజ్రంచూపించారు. వాళ్ళు ఆనందించారు గాని కొనడానికి సొమ్ము లేదన్నారు. పిట్టుగారు మళ్ళీ పార్లమెంటు సభ్యుడైనాడు. అమెరికా దగ్గరఉన్న జెమేయికాకు గవర్నరుగా వెడతావా అని ప్రభుత్వంవారు ఆయన్ని అడిగారు. ఆయన ఆవుద్యోగం నాకక్కరలేదన్నాడు. ఆయన అనేక జమీందారీలను చాలా జిల్లాలలోకొని వాటిని అభివృద్ధిచేశాడు. గొప్పగొప్ప ప్రభువులతో సంబంధాలుచేశాడు. తనగొప్పవజ్రం అమ్ముడుకాకపోయినా పరవాలేదు గాని అమ్ముడుపోలేదే అనే దుగ్ధ అతన్ని బాధ స్తూనేవుంది. ఎంతడబ్బుఉన్నా అతని ఆశకు మితిలేదు. బ్రతుకుమీద్ద కూడా విసుగుపుట్టేంది. తనకు అరవై నాలుగేళ్ళు వచ్చినవి గాని తానెంతో కష్టపడి సంపాదించి ఎంతో ఆదుర్దాపడుతూవున్న ఈవజ్రం అమ్ముడుపోలేదు. ఇలా వుండగా 1717వ సంవత్సరంలో ఫ్రెంచిరాజ్యాన్ని రీజెంటు అనే బిరుదుతో పరిపాలించే ఆర్లియన్సు ప్రభువు ఆవజ్రాన్ని 2000000 లివర్సు (125000 నవరసులు) అనగా రమారమి 1875000 రూపాయిలకు కొన్నాడు. ఆమొత్తంమీద నూటికి అయిదుచొప్పున తనకు కమిషను రావాలని ఈవ్యవహారంలో చాలా కాలంనుంచి పిట్టుగారి ప్రతినిధులుగా పనిచేసిన సర్ స్టీఫెన్ ఈవాన్సుగారు కోరారు. ఆకమిషను ఇవ్వనందువల్ల, పిట్టుగారిమీద వ్యాజ్యం దాఖలైంది.

పిట్టుగారు తన 73 వ ఏట 1726 వ సం॥ ఏప్రిలు 28 వ తేదీన మరణించాడు. తరువాత పదో నెలలో ఆయన భార్యాయున్నూ 13 వ నెలలో పెద్ద కొమారుడున్నూ మూడు సంవత్సరాలలో రెండవ కొమారుడున్నూ మరణించారు. పెద్ద కొమారుడికొడుకే ఇంగ్లాండుకు ప్రధానమంత్రి అయినవిలియం పిట్టు. పిట్టుగారి మూడవకొడుకూ, ఆయన కొమార్తెలు, మనమలను ఎత్తి ఆయన ఐశ్వర్యం అనుభవించారు.

### పిట్టువజ్రం అసలు కథ

సర్ ఎడ్విన్ స్ట్రీటర్ అనే అతను "ప్రపంచంలోని గొప్ప వజ్రాలు" అనే గ్రంథంలో పిట్టు వజ్రి యొక్క చరిత్రను గురించి ఈ క్రింద సంగతులను వ్రాసి ఇవి యథార్థమనడానికేమీ సందేహం లేదని అన్నాడు. 1701 వ సంవత్సరంలో కృష్ణాజిల్లాలో పరిటాల గనులలో పనిచేసే ఒక బానిసకు ఈ వజ్రం దొరికింది. ఈ వజ్రాన్ని గనులలో నుండి బయటికి తీసుకు వెళ్ళడానికోసం వాడు తన పిక్కలో ఒక పెద్దగాయం చేసుకుని ఆగాయంలోనే దానిని దాచి తీసుకుని వెళ్ళాడని ఒక వదంతిన్నీ ఆగాయం కట్టులో దాచాడని ఒకవదంతిన్నీ వున్నవి. ఈ వజ్రంకోసి సానపట్టక పూర్వం 410 కారట్టుల ఎత్తు వుండేది. అందువల్ల ఇంత పెద్దరాయిని గాయంలో దాచినాడనడం కంటె కట్టుగుడ్డలలో దాచినాడనడమే సమంజసముగా వుంటుంది.

అమూల్యమైన ఆవజ్రంతో ఆబానిస పరారి అయి సముద్రతీరం చేరుకున్నాడు. అతని దురదృష్టవశం చేతను వాడికొక ఇంగ్లీషు ఓడకెప్టాన్ కనపడగా వాడు తన రహస్యం వాడికి చెప్పి తన నేదైనా దేశానికి తీసుకొనిపోయి వదిలిపెట్టవలసినదనిన్నీ తాను స్వేచ్ఛగా బ్రతుకుతాననిన్నీ అందుకు ప్రతి ఫలంగా ఆవజ్రాన్ని ఆతనికియిచ్చి వేస్తాననిన్నీ ఆ కెప్టానును బ్రతిమాలు కున్నాడుట. అంత వెలగల గొప్ప వజ్రాన్ని యిచ్చినందుకు తనకేదైనా, కాస్త డబ్బుకూడా ఇవ్వవలసిందని ఈ బానిసవాడు ఆ ఇంగ్లీషువాడిని కోరి వుంటాడనడానికి సందేహము లేదు. ఆ కెప్టాను మొదట సరేనని అన్ని షరతులకూ ఒప్పుకొని, బానిసను తన ఓడమీది కెక్కించు కున్నాడు. వజ్రాన్ని

చేజిక్కించుకొన్న తరవాత వాడికి దురుద్దేశ్యం కలిగి ఈ బానిసను సముద్రంలోకి తోసివేసి యెలాంటి నిక్కా లేకుండా ఆ వజ్రం తనకు దక్కిందని సంతోషించాడు. తరవాత ఈ కెప్తాను చెన్నపట్నంరేవులో సెంట్ జార్జి కోట గవర్నరైన థామస్ పిట్టుకి ఈ వజ్రాన్ని వెయ్యి నవరసులకు విక్రయించి ఆసొమ్మును తన చిత్తంవచ్చినట్లల్లా ఖర్చు పెట్టేశాడు. తా నాబానిసను ద్రోహంచేసి వాడినిచంపిన పాపం వాడి మనస్సును బాధిస్తూనేవుంది. ఆ బానిసవాడు దయ్యమై తన్ను వెంబడిస్తూ వున్నట్టుగా భావిస్తూ దానిని మరచిపోవడానికి తెగతాగి చివరకు మతిచెడి ఉరిపెట్టుకొని చచ్చిపోయాడు.

అపూర్వమైన ఈ వజ్రం యొక్క పుట్టుక పూర్వోత్తరాలను గురించిన కథ పై విధంగా ప్రచారంలో వున్నదని స్ట్రీటరుగారు తమ గ్రంథంలో వ్రాస్తూ బహుశా ఆ ఓడ కెప్తాను ఆవజ్రాన్ని తిన్నగా పిట్టుగారికే విక్రయించి వుండడనిన్నీ అప్పట్లో యీ దేశంలో చాలా ప్రఖ్యాతి చెందిన వజ్రాల వర్తకుడైన జామ్‌చందుకే వెయ్యి నవరసులకు విక్రయించి వుంటాడనిన్నీ ఆజామ్‌చందు దానిని పిట్టుగారికి ఇరవై వేల నవరసులకు విక్రయించి వుండవచ్చుననిన్నీ స్ట్రీటరుగారు తమ అభిప్రాయాన్ని ఆపుస్తకములో వ్రాశారు. స్ట్రీటరుగారి యీగ్రంథము 1896 లో ప్రకటించ బడింది. ఈ వజ్రాన్ని తాను సంపాదించిన కథను గురించి పిట్టుగారు 1710 సంవత్సరములో వ్రాసివుంచిన సంజాయిషీ పత్రంలోని సంగతులు పిట్టుగారు అతని కొడుకూ కూడా చనిపోయిన చాలా కాలానికి 1743 లో లండను డెయిలీ పోస్టు అనే పత్రికలో ప్రకటించ బడినవి. ఆ సంజాయిషీ పత్రం మళ్ళీ 1776లో జెంటిల్మెన్సు మాగజీనులోనూ 1793 లో యూరపియను మాగజీను లోనూ ప్రకటించబడింది. స్ట్రీటరుగారు దానిని చదివి పై విధంగా ఆ కథలను సమన్వయం చేసి వుంటారుగాని ఈ పిట్టుగారి చరిత్రలోని సంగతి సందర్భాలన్నీ ఆయన చదివి వుంటే ఎలా అభిప్రాయపడేవారో!

## పి ట్టు వ జ్రం ఏ మై ం ది?

ఈ రీజెంటు వజ్రంయొక్క తరువాత చరిత్రకూడా చిత్రమైనదే. 1722 వ సంవత్సరములో ఫ్రెంచిరాజైన 15 వ లూయీ

పట్టాభిషేకసమయంలో ఆయనధరించినకిరీటంలో ఈ వజ్రాన్ని పొది గారు. తరువాత ఫ్రెంచి దేశంలో ప్రజావిప్లవం జరిగినప్పుడు 1791 లో జాతీయ మహాసభవారి వుత్తర్వుప్రకారం తయారుచేయబడిన ఫ్రెంచి దేశరాజకుటుంబముయొక్క ఆభరణాల జాబితాలో ఈ వజ్రం కన బడుతూవుంది. తగినధర వస్తే దీనిని విక్రయిద్దామని జాతీయ మహాసభ వారు నిశ్చయించారుగాని కొనేవారు కనబడలేదు. ఇంతలో తక్కిన ఆభరణాలతోపాటు దీనిని కూడా దొంగలు ఎత్తుకొనిపోయి ఒక చిన్న యింటి సరంబీలో దాచారు. కొంతకాలానికి ఫ్రెంచి ప్రజాస్వామికం అధికారులకు ఇది కనబడగా జాతీయ ధనాగారంలో వుంచారు. 1804 లో మహావీరుడైన నెపోలియన్ చక్రవర్తి తనకు పట్టాభిషేక మైనప్పుడు దానిని తన ఖడ్గములో తాపించాడు.

నెపోలియన్ పదభ్రష్టుడైనప్పుడు ఆయనభార్య మేరీ లూయీ తక్కిన అమూల్య వస్తువులతోపాటు దీనిని తీసుకొనిపోయింది. ఈలోవుగా 18 వ లూయీ ఫ్రెంచిరాజు కాగా ఆవిడ తండ్రి ఆ వజ్రాన్ని ఆయనకు పంపించివేశాడు. నెపోలియన్ ఎల్బా దీవి నుండి తప్పించుకొని మళ్ళీ చక్రవర్తి కాగా లూయీరాజు ఆవజ్రంతో పరారి అయి నెపోలియను వాటర్లూ యుద్ధంలో ఓడిపోయినతరవాత దానితో ప్యారిసుకు వచ్చాడు. 1830 లో 10వచార్లెసు పట్టాభిషేకం లో ఆవజ్రాన్ని అలంకరించుకున్నాడు. మళ్ళీ ప్రజాస్వామికం స్థాపిం చిన తరవాత అది కొనేవారులేక ఫ్రెంచివారి ఖజానాలోనే పడివుంది.

Memories of Madras by Sir Charles Lawson pp 12—53 and 300.

---

## బుకర్ వాషింగ్టన్

ఇప్పటికి 20 సంవత్సరాల క్రిందటి వరకూ అమెరికా దేశంలో నుండే నీగ్రోజాతివారంతా బానిసత్వంలో పడివుండి ఎన్నో బాధ లనుభవించేవా రని అందరికీ తెలుసును. అమెరికా దేశానికి క్రొత్తగా కాపురానికి వెళ్ళిన తెల్లదొరలకు వ్యవసాయం పనులు చేయడానికి

మనుష్యులు కావలసి వచ్చారు. అందుకోసం ౧౬౫౦ వ సంవత్సరం ఆ ప్రాంతమునుండి పోర్చుగల్లు దేశపు తెల్లవారు ఆఫ్రికా దేశంలోని నీగ్రోజాతివల్ల వారిని పట్టుకొని అమెరికాకు తీసుకొనివెళ్ళి బానిసలుగా అమ్మివేయడం ప్రారంభించారు. కొన్నాళ్ళకి వ్యాపారం ఇంగ్లీషు వారి చేతులలోకి వచ్చింది. నిర్భాగ్యులైన నీగ్రోలను వేలకొద్దీ అమెరికాకు ఎగుమతి చేయడం మొదలుపెట్టారు.

అమెరికాదేశం ౧౭౭౬లో ఇంగ్లాండు పరిపాలనను ధిక్కరించి స్వాతంత్ర్యం ప్రకటించింది. ఆ ప్రకటనలో మానవు లందరు సమానులే అనిన్నీ, స్వతంత్రంగా జీవించడానికి హక్కుగల వారనిన్నీ చాటించారుగాని నీగ్రోల విషయంలో ఈ ధర్మం పాటింపబడలేదు. నీగ్రోలకు ఆస్తి వుండడానికి వీలులేదు. నీగ్రోలను పశువులలాంటి చరాస్తికింద పరిగణించేవారు. సామాన్యమానవుల కుండవలసిన స్వేచ్ఛ స్వాతంత్ర్యము గౌరవములు నీగ్రోలకులేవు. వారు మనీ మాలమాదిగలకన్న అధోగతిలో వుండేవాళ్ళు. వాళ్ళకు చదువు లేదు. చదువుకోడానికి వీలులేదు. హారియట్ బీచర్ స్టౌ అనేఆమె 'అంకుల్ టామ్సు కేబిన్' అనునవలలో నీగ్రోల దుస్థితి గురించి చాలా చక్కగా వర్ణించింది. ఈనవలవల్ల చాలామంది తెల్లవారికి హృదయాలు కరిగి నీగ్రోల యెడల సానుభూతి కలిగింది.

అమెరికాదేశంలో ఉత్తర భాగంలోనున్న రాజ్యాల వారికి మొదటినుంచీ బానిసత్వం అంటే ఇష్టంలేదు. దక్షిణభాగపు రాజ్యాలలోనున్న తెల్లదొరల క్రిందనే యెక్కువమంది నీగ్రో బానిసలు వుంటూ వుండేవారు. ఈ బానిసత్వం శాశ్వతంగా వుండాలనే ఈరాజ్యాలవారి పట్టుదల. ఈఅభిప్రాయ భేదము వల్లను, ఇంకా కొన్ని కారణాలవల్లను అమెరికాదేశంలో ఉత్తర భాగానికిన్నీ దక్షిణభాగానికిన్నీ ౧౮౬౧లో యుద్ధం కలిగింది. ఆ సమయంలో ఉత్తరమున ఉన్న అమెరికాసంయుక్త రాష్ట్రాలకు అబ్రహాం లింకను అనేమహానుభావుడు అధ్యక్షుడైనాడు. 'బానిసత్వమే తప్పు కాకపోతే ప్రపంచంలో మనము తప్పు అనుకొనేది ఏదిన్నీకూడా తప్పుకాదనే చెప్పవలసి వస్తుంది' అని ఆయన అంటూవుండేవాడు.

ఆయన దయవల్ల ఆఖరికి దిక్కులేని ఈదీనజనుల అదృష్టం బయటబడింది. ౧౮౬౩ జనేవరి ౧-వ తేదీన అబ్రహాం లింకను అమెరికాలో బానిసత్వం రద్దుచేసి నీగ్రోబానిసల నందరినీ విడుదల చేయవలసిందని శాసించాడు * దీనివల్ల బానిసత్వంయొక్క ఇనుపసంకెళ్లు విడిపోయినవి, గాని ఆర్థికంగానూ సాంఘికంగానూ మాత్రం నీగ్రోలస్థితిలో మార్పు కలగలేదు. ఇంతవరకూ అజ్ఞానంలోను బానిసత్వంలోను పడివున్న నీగ్రోలకు స్వాతంత్ర్యము ఇచ్చినందువల్ల వీళ్లు కూలీనాలీ చేసుకొని జీవించవలసివచ్చింది. వీళ్లపైన ద్వేషం వహించి తెల్లవారు వీళ్లకు సరియైన కూలి యివ్వరు, స్వతంత్రవృత్తులు చేసుకోవడానికి వీళ్ల కవి చేతకావు. యంత్ర పరిశ్రమలలో ప్రవేశంలేదు. చేతిపనులు తెలియవు. వీళ్లు ఘోరమైన దారిద్ర్యములో మునిగివున్నందువల్ల చదువుకోడానికి శక్తిలేదు. వీళ్లు ఇంత అధోగతిలో పడివుండడానికి మూలకారణము వీళ్ల బానిసత్వమే.

నీగ్రోబానిసలకు చదువు వస్తే వాళ్లు చెప్పినమాట వినరని అమెరికాదేశంలోని తెల్లవారిఊహ. అందువల్ల చాలా రాష్ట్రాలలో నీగ్రోలకు చదువుచెప్పడము తుదకు వర్ణక్రమము చెప్పడముకూడా నేరాలుగా చేశారు. కొన్నిరాష్ట్రాలలో నేరాలుగా చేయకపోయినా పాఠశాలలలో నీగ్రోలను చేర్చుకోకూడదనే నిషేధాలు చేశారు. ఇంకా కొన్ని రాష్ట్రాలలో అనేక ఆటంకాలు పెట్టారు. మిసిసిపీలో చదువుకోడానికిగాని వ్రాయడానికిగాని రాత్రిగాని పగలుగాని, నీగ్రోలుగాని నీగ్రోస్త్రీకి తెల్లవారికి పుట్టినవారుగాని, అయిదుమంది చేరినచో నది అక్రమ సమావేశమని ౧౮౧౩లో విధించారు, నీగ్రోపాఠశాలలో తెల్లవారు చదువు చెప్పకూడదని కొన్నిరాష్ట్రాలవారు విధించారు.

ఇన్ని ఆటంకాలు వున్నా నీగ్రోలలో కొందరికి చదువుకోవాలన్న సంకల్పము కలిగి వాళ్లు రహస్యంగా చదువు నేర్చుకునేవారు. వాళ్లు చాకిరీ చేసి చేసి ఏరాత్రి వేళనో రహస్యంగా అక్షరాలు నేర్చు

* అప్పటికి అమెరికా సంయుక్తరాష్ట్రాలలో 50 లక్షల మంది నీగ్రోబానిసలున్నారు.

కుంటూవుంటే అది చూచి కొరడాపుచ్చుకొని కొట్టిన తెల్లయజ మానులు కూడా వుండేవారు. కొందగు ధర్మాత్ములుమాత్రం చదువుకో నిచ్చేవారు. బానిసత్వం మాన్పబడేవరకూ నీగ్రోలకు చదువు కోడానికి ఇన్ని ఆటంకాలు ఉండేవి. అందువల్ల నీగ్రోబానిసలు స్వాతంత్రులయ్యేటప్పటికి నూటికి 95 మందికి చదువులేక అజ్ఞానంలో పడివున్నారు. తరువాత 50 సంవత్సరాలలో ఈ నీగ్రోలను ఉద్ధరించడానికి విశేషకృషి, జరిగింది. దానిఫలితాన్ని గురించి 1911 లో జరిగిన విచారణవల్ల ఈక్రిందిసంగతులు బయల్పడినవి.

చదువుకునే వయస్సుగల నీగ్రోపిల్లలలో హెచ్చుమంది బడులలో లేరు. దీనికి ముఖ్యకారణం - పాఠశాల సౌకర్యాలు లేకపోవడమే. రెండవకారణము - దారిద్ర్యమూ, తల్లిదండ్రుల అజ్ఞానమూ. పాఠశాలలలోవున్న పిల్లల చదువు చాలా అసంతృప్తి కరంగా ఉన్నది. చాలీచాలని జీతాలతో వచ్చీరాని చదువు చదివిస పంతుళ్ళు సాలుకు మూడునెలలో లేక ఆరునెలలో మాత్రం చదువు చెప్పుతున్నారు. నీగ్రోపాఠశాలలు వుంచడానికి ఇళ్ళులేవు. వాటికి సరియైన పరికరాలు లేవు. ఈపాఠశాలలను సరిగా తనిఖచేయరు. వీటికి గ్రాంటులు సరిగా లేవు. వృత్తివిద్యగాని యంత్రపరిశ్రమగాని నేర్పే పాఠశాలలలో చెప్పేచదువు పనికిమాలినది. నీగ్రోలకు ఆ వృత్తి వ్యాపారాలలో నైపుణ్యం అలవర్చడానికి గాక వాళ్ళని నీచపు చాకిరీ చేయడానికే ఉపయోగించుతూవుంది. ఉన్నత విద్యను బోధించే విద్యాలయాలను ఆదరించడంలేదు. ఇన్ని లోపాలువున్నా ఈ యాభై సంవత్సరాలలో జరిగిన నీగ్రోల విద్యాభివృద్ధి భారతదేశ విద్యాభివృద్ధి కన్న చాలా బాగున్నదని చెప్పవచ్చును.

నీగ్రోలలోనే కొంతమంది విద్యాధికులు నాయకులు బయలుదేరి విద్యాభివృద్ధికి నడుముకట్టి పనిచేస్తున్నారు. నీగ్రోలలో అక్షర జ్ఞానము నూటికి 55 మందికి పెరిగినది. ముఖ్యంగా ఆడవాళ్ళ చదువు విషయంలో నీగ్రోజాతివారు మనకన్న అభివృద్ధిలో నున్నారు. ఈ అభివృద్ధి బుకర్ వాషింగ్టన్ వంటి నీగ్రోనాయకులు చేసిన కృషియొక్క ఫలితమే అని చెప్పవచ్చును. నీగ్రోజాతి ఈ ఘోరదాస్యంలో నుంచి

అజ్ఞానంలోనుంచి బయటపడి స్వతంత్రజీవనం చేసే శక్తి కలగాలంటే ఏకొద్దిమంది నీగ్రోలో పుస్తకాల చదువులు చదివి బి. ఏ., ఎం. ఏ. పట్టాలు పొందితే లాభం లేదనిన్నీ, జనసామాన్యాని కందరికీ శాస్త్ర వారిత కోతలు రావడమే గాక వాళ్ళకు మతం సంగతీ ప్రపంచం సంగతీ కొంచెం తెలియాలనిన్నీ, దేశవ్యాపార యంత్రపరిశ్రమలలో వీళ్ళకు కొంత ప్రవేశమూ అనుభవమూ కలగాలనిన్నీ, మొగ పిల్లలకీ ఆడపిల్లలకీ పనిపాటులు చేయడం అంటే పరువుతక్కువ అని తోచే పుస్తకాల చదువు చెప్పడంవల్ల ఆజాతి బాగుపడడం కష్ట మనిన్నీ, పిల్లలు చదువుతోపాటు జీవన విధానాన్నికూడా అభ్య సించాలనిన్నీ, చదువు పూర్తి అయ్యేటప్పటికి స్వతంత్రజీవనం చేసు కొనేశక్తి వీళ్ళకు కలగాలనిన్నీ గ్రహించి నీగ్రోనాయకుడైన బుకర్ వాషింగ్టను ఈ ఉద్దేశాలతో విద్యాబోధనము ప్రారంభించి, కృత కృత్యు డైనాడు. ఇతని జీవితచరిత్ర చదివితే నీగ్రోజాతి ఎలా వుద్ధ రింపబడిందీ తెలుస్తుంది. ఇతడు నిర్వహించిన విద్యాపద్ధతివల్ల మనం నేర్చుకో తగిన పాఠాలు చాలావున్నవి.

మన కథానాయకుడైన బుకర్ టి. వాషింగ్టన్ అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వర్జీనియా పరగణాలో ఫ్రాంకిలిన్ జిల్లాయందు ఒకతోటలో ౧౮౫౮-వ సంవత్సరమున ఒక బానిసగా జన్మించినాడు. ఆ తోటదగ్గర కొంతదూరములో హేల్సుఫోర్డు అనుపేరుగల ఒక పోస్టుఆఫీసు ఉన్నది. అతని జీవితము చాలా దీనస్థితిలో దుఃఖకరమైన పరిస్థితులలో ఏ విధముగా చూచినా తరణో పాయములేని పరిస్థితులలో ప్రారంభమైనది. అతను జన్మించిన యిల్లు ఒక రైలుపెట్టిలాంటి కొయ్యగది. ౧౬ అడుగులపొడుగు, ౧౪ అడుగుల వెడల్పు. దీనిలోనే యితనితల్లి, తక్కిన కుటుంబము కాల క్షేపము చేసేవారు. సివిలు యుద్ధమువచ్చి నీగ్రోలబానిసత్వము రద్దు అయ్యేవరకూ ఈకుటుంబమువారంతా బానిసలుగానే వుండేవారు. తరు వాత బుకర్ వాషింగ్టన్ తల్లి పడమటి వర్జీనియాకు వలసవెళ్ళి అక్కడ మాల్డెన్ అనే గ్రామంలో పునర్వివాహము చేసికొంది. వాషింగ్టన్ సవతితండ్రి అక్కడ ఒక ఉప్పుఫ్యాక్టరీలో పనిచేస్తూ వుండడంవల్ల

మన వాషింగ్టనుకూడా ఆపనిలోనే ప్రవేశపెట్టాడు. చాలా చిన్న తనంలోనే వాషింగ్టను ఇలాగ జీవనంకోసం పనిచేసుకోవలసివచ్చింది.

వాషింగ్టనుకు బాల్యమునుండన్నీ చదువుకోవాలనే ఆసక్తి వుండేది. ఈ క్రొత్తవూరు వచ్చినతరువాత ఏదైనా పుస్తకము సంపాదించిపెట్టమని తల్లిని కోరగా కోరగా ఆమె ఎలాగో కష్టపడి ఒక ఇంగ్లీషు స్పెల్లింగు పుస్తకము సంపాదించిపెట్టింది. అతను చదివిన మొదటిపుస్తకము ఇదే. ఇంతలో దగ్గరలోనే ఒకస్కూలు పెట్టారు. కాని పగలు చదువుకొనడానికి వాషింగ్టనుకు తీరుబడి లేదు. అందువల్ల ఆ బడిపంతులు నాశ్రయించి రాత్రిళ్ళు కాస్త చదువుచెప్పమని బ్రతిమాలుకొన్నాడు. ఇతను కుశాగ్రబుద్ధి కావడమువల్ల తక్కిన పిల్లలు పగలు చదివిన దానికంటె ఇతడు రాత్రిపూటనే హెచ్చు చదువును చదువుకో గలిగాడు. పగటిపూట పనిపాటులు చేసుకొనేవాళ్ళకు చదువుచెప్పడానికి రాత్రిపాఠశాలలు పెట్టవచ్చునని గ్రహించి పెద్దవాడైన తరువాత హాంప్టనులోను టస్కీజీలోను ఇతడు రాత్రిపాఠశాలలు స్థాపించడానికి ఇదే కారణమైంది.

ఉప్పుఫ్యాక్టరీలో కొన్నాళ్లు పనిచేసినతరువాత ఇతనిని ఒకబొగ్గుగనిలో పనికి కుదిర్చారు. ఇది చాలా కష్టమైనపనే కాకుండా గనిలో కూరిన తుపాకిమందు పేలుతూవుండడమువల్ల పైనుంచి బొగ్గుఅండలు కూలుతూ తరుచు అనేకమందికి దెబ్బలు తగులుతూ వుండడము ప్రాణభయముకూడా కలుగుతూవుండడము చూచి యితడెల్లప్పుడూ భయోత్పాతముతోనే కాలక్షేపము చేస్తూ వుండేవాడు. ఈగనిలో పనిచేస్తూవుండే రోజులలోనే హాంప్టను అనేచోట వ్యవసాయపుపనులు చేస్తూనే చదువుకోడానికి వీలైన "నార్మల్ అగ్రికల్చరల్ ఇన్‌స్టిట్యూట్" ఒకటి స్థాపించబడినట్లు ఇతనువిన్నాడు. ఎలాగయినా అక్కడకువెళ్లి చదువుకోవాలని ఇతనికి బుద్ధిపుట్టింది. కాని ఆబడివున్న వూరు ఎక్కడవున్నదో ఈతనికి తెలియదు. వెళ్ళడానికి చేతులో డబ్బూలేదు. ఈపిల్లవాడు దీనినిగురించి రాత్రింబవళ్ళు ఆలోచిస్తూ వుండేవాడు. ఇంతలో కొద్దిరోజులలో జనరల్ రఫెనర్ ( Ruffener)దొరగారియింట్లో పనులు చేయడానికి నౌఖరు కావాలిసి ఉన్నట్లు తెలిసింది.

రఫెనర్ దొరసాని దగ్గర పనిచేయడం చాలా కష్టమనిన్ని, ఆమె దగ్గర నౌఖరీచేసే పిల్లలను ఆమె రాచి రాపాడుతుందనిన్ని ప్రఖ్యాతి. ఏమైతేనేమి ఈ బొగ్గుగనిలో పనిచేయడం చాలా దుర్భరమైనందువల్ల వారింట్లో పనికి ప్రవేశించాడు- వాషింగ్టను. ఈ దొరసాని స్వతస్సిద్ధముగా క్రూరురాలు కాదనిన్ని, ఆవిడకు అన్నిపనులూ పరిశుభ్రముగా వుండాలనిన్నీ, ఆమె చెప్పినట్లు పనిచేసి నమ్మకముగా వుంటే ఆమెను మెప్పించవచ్చుననిన్నీ వాషింగ్టన్ త్వరలోనే గ్రహించాడు. ఈ రఫెనర్ దొరసాని చిత్తవృత్తులనుబట్టి నడచుకోవడములో ఈతడు నేర్చుకొన్నపాఠాలు ఇతడు తరువాత పాఠశాలలో నేర్చుకొన్న పాఠాలతో సమానమైన విలువగలవేయని ఇతడు తరువాత గ్రహింపగలిగాడు. ఇతని మంచితనము నీతి సత్ప్రవర్తనము యజమానురాలికి ఇతనిపైన చాలా దయగలిగించినవి. చదువుకోవాలని ఇతనికిగల గాఢమైన కోరికను చూడగా ఆమెకు దయగలిగింది. పనిలేనివేళలలో ఇతడు చదువుకుంటూవుంటే సంతోషించి ప్రోత్సాహం చేసేది.

ఇతడు హాంప్టనుకు పోవడానికి ౧౮౭౨ లో నిశ్చయము చేసుకొన్నాడు. కాని బట్టలు కొనుక్కొనడానికిగాని ప్రయాణానికిగాని డబ్బులేదు. వెళ్ళవలసిన ఊరు దగ్గరలో లేదు. ౫౦౦ మైళ్ళదూరం. ఈసమయములో ఇతనితల్లికి జబ్బుగా వుంది. మళ్ళీ చూస్తానో లేనో అని కంట నీరుపెట్టుకున్నాడు. ఏమైనాసరే తలపెట్టిన ప్రయాణము ఆపివేయడానికి ఇష్టపడలేదు. ధైర్యముచేసి బయలుదేరాడు. కొంతదూరము నడుస్తూ ఆగుతూ మధ్యమధ్య మోటబళ్ళవారిని, గుఱ్ఱపుబళ్ల వారిని బ్రతిమాలి ఆ బళ్లలో ఎక్కుతూ దిగుతూ మళ్ళీ నడుస్తూ యిలా చాలా రోజులు ప్రయాణముచేసి ఆఖరుకు ఒక రాత్రి రిచ్మాండు చేరాడు. నిరంతర ప్రయాణమువల్ల తిండిలేక పోవడమువల్ల చిక్కి శల్యమైనాడు. ఆ రాత్రికి వుండడానికి ఎక్కడా స్థలము లేక ఒక వీథిలో దుకాణాల బల్లకూర్పుక్రింద ఒళ్ళు వాల్చినాడు. పొద్దున లేచేటప్పటికి రేవులో ఒక ఓడలోనుంచి సరుకు దిగుమతి అవుతూవుండడం చూశాడు. తానుకూడా కొన్ని మూటలు మోసి కూలిడబ్బులు సంపాదించినాడు. ఈ సొమ్ముతో తనయాత్ర పూర్తిచేయగా ౫౦ సెంట్లు,

అనగా రు ౧-౯-౦ లు మిగిలినవి. ఈ సొమ్మును తాను చేగ దలచిన సరస్వతీపీఠానికి కానుకగా సమర్పింప దలచినాడు ఈకుచేలుడు.

హాంప్టన్ చేరగానే ఇతడు, పాఠశాలాధికారిణి అయిన మిస్. ఎఫ్. మేకీదొరసానిని చూచి తనను చేర్చుకోమని ప్రార్థించాడు. ఇతని బక్కచిక్కిపోయిన శరీరమూ, మాసిన తల, చిరిగిపోయిన బట్టలు చూచి వీడెవడో బికారివాడులాగ కనబడినందువల్ల ఆమె కొంతసేపు ఏమీ జవాబు చెప్పలేదు. ఎంతో ప్రాధేయపడగా ఆఖరికి విసుగుతో ప్రక్కనవున్న ఖాళీగది చూపించి 'ఈ చీపురుపుచ్చుకొని ఆగది శుభ్రముగా వూడ్చు, తరువాత ఆలోచిస్తాను' అంది. ఆమె ప్రసన్నురాలై పని చెప్పినందుకు ఇతడు ధైర్యము చెంది వెంటనే ఆ చీపురు పుచ్చుకొని ఆ గదిని జాగ్రత్తగా వూడ్చాడు. ఇదే ప్రవేశపరీక్షయేమో-ఏమూలైనా దుమ్ము దిగబడిపోతుందేమో అన్నంతభయముతో మూడుమాట్లు నొక్కినొక్కి వూడ్చాడు. పరిశుభ్రంగా వూడ్చి పని పూర్తిచేసి ఆమెకు మనవిచేశాడు. వీడు చేసినపనిలో తప్పు పట్టలేక పోతానా అనేధైర్యముతో ఆమె వచ్చింది. సాధారణముగా దుమ్ము ఎక్కడ దిగబడుతుందో ఆమెకు తెలుసును. గది నలుప్రక్కల చూసింది. మూరుమూలలు అన్నీ పరికించి చూసింది. ఆఖరికి తన జేబుగుడ్డను దీసి బల్లకూర్పుమీద రాచి చూసింది. ఎక్కడా మచ్చుకైనా కాస్తదుమ్ము అయినా కనబడకపోయేటప్పటికి ఆమె సంతోషించి నిన్ను మాబళ్ళో చేర్చుకోవచ్చునని తోస్తుంది అన్నది! 'నీవు బడిజీతం ఇచ్చుకోలేవు. ఇప్పుడు వ్యవసాయం పనులూ, ఇతరపనులూ ఖాళీగా లేవు. బట్టలుతికేపని చేస్తావా'? అంది. ఏపని అయితే నేమి, తప్పకుండా చేస్తానని అతడు సంతోషముతో వప్పుకొన్నాడు. దరిద్రుడైన వాషింగ్టనుకు కిది పరువుతక్కువ యని తోచలేదు. 3 సంవత్సరములు ఈ పాఠశాలలోచాలా కష్టపడి పని చేస్తూ చదువుకొని ౧౮౭౫లో పట్టభద్రుడైనాడు. హాంప్టను పాఠశాలయొక్క స్థాపకు డైనటువంటి జనరల్ శామ్యూల్ సి. ఆరమ్ స్ట్రాంగ్ దొరయొక్క ప్రేమకు పాత్రుడయ్యాడు.

బుకర్ వాషింగ్టను పట్టభద్రుడైన తరువాత మళ్ళీ మాల్డెన్ గ్రామానికి వచ్చేశాడు. అక్కడ అతనిని నల్లవాళ్ళబళ్లో ఉపాధ్యాయునిగా ఎన్నుకొన్నారు. రెండేళ్లు పనిచేసిన తరువాత అతడు వాషింగ్టన్ - డి. సి.కి వెళ్ళి మళ్ళీ ౮ నెలలు చదువుకొన్నాడు. ౧౮౭౮లో హాంప్టను విద్యాలయం పట్టభద్రులకు ఉపన్యాసం ఇవ్వవలసిందని జనరల్ ఆరమ్‌స్ట్రాంగుదొర ఇతనిని ఆహ్వానించాడు. తన కిది యొక పెద్దగౌరవమని వాషింగ్టను సంతోషించి "ఆత్మశక్తి విజయము" అనే విషయాన్ని గురించి ఉపన్యసించాడు. ౧౮౭౯ లో ఇతనిని హాంప్టన్ విద్యాలయంలో ఉపాధ్యాయునిగా నియమించారు. అక్కడ పనిచేస్తూనే ఇతడు ఇంకా పెద్దచదువు చదివాడు. ఆ సమయంలో ఆరమ్ స్ట్రాంగుదొర ఉత్తర అమెరికాలో ఆదిమవాసులైన ఎర్ర ఇండియనులకు విద్యాబుద్ధులు చెప్పడానికి కృషిచేస్తూవుండి వాళ్ళలో ౭౫ మందికి చదువుచెప్పి బాగుచేయమని వాషింగ్టనుకు అప్పగించాడు. తనజాతితో సంబంధంగాని పోలికలుగాని లేని ఈ ఆదిమవాసుల జాతివారికి విద్యాబుద్ధులు చెప్పడం చాలా కష్టమైనపని. దీనిలో చాలా యిబ్బందులుకూడా వున్నవి. అయినా వాషింగ్టను దీనిని చాలా చక్కగా నిర్వహించాడు. ఈహాంప్టను విద్యాశాఖలో వాషింగ్టను రాత్రిళ్లు చదువుచెప్పే తరగతి ఒకటి స్థాపించాడు. విద్యార్థులు పగలు పదిగంటలు కాయకష్టంచేసి తమ జీవనోపాధిని సంపాదించుకొని రాత్రిళ్ళు ఈ పాఠశాలలలో చదువుకోవచ్చును. తమ పనిపాటులలోను చదువులోను ఈ విద్యార్థులు చూపిన పట్టుదలను జూచి వాష్టింగ్టను ఈ తరగతికి "వస్తాదుల తరగతి" అని పేరు పెట్టాడు.

ఇట్టి స్థితిలో అలబామారాష్ట్రంలో టస్కీజీలో నల్లవాళ్ళకు విద్యాబుద్ధులు చెప్పడానికి తగిన ఉపాధ్యాయు డెవరైనా ఉంటే సిఫారసు చేయవలసిందని ౧౮౮౧ లో కొందరు పెద్దమనుష్యులు ఆరమ్‌స్ట్రాంగుదొరను అడిగారు. ఈయన మన వాషింగ్టనును శిఫారసు చేశాడు. వాళ్ళు అంగీకరించారు. టస్కీజీ చాలా చిన్న ఊరు. ఈ ఊళ్లో రెండువేలమంది జనసంఖ్య ఉంటారు. వీరిలో సగంమంది నీగ్రో

వాళ్లే. బడిఅన్నతరువాత దానికి కావలసిన కట్టడము పరికరాలు ఉండక పోతాయా అని అనుకున్నాడు వాషింగ్టను. కాని టస్కీజీకి వెళ్ళి చూసేటప్పటికి అతడు డీలపోయాడు. అక్కడ ఏమీ లేదు. ఉపాధ్యాయుల జీతంకోసం రాష్ట్రీయప్రభుత్వంవారు • రెండువేల డాలర్లు మాత్రం మంజూరు చేశారు. బడిపెట్ట చోటూలేదు, బళ్లోకి బల్లలూ లేవు, ఏమీ లేదు. అయితే చదువుకోవాలని ఆసక్తిగలవారుమాత్రం కొన్ని వందలమంది కనపడ్డారు.

ముందుగా అతడు చేయవలసిన పని బడి పెట్టడానికి ఒకప్రదేశం వెతుక్కోవాలి. పాడుపడిన చర్చి ఒకటిన్నీ దానిని అంటి ఒక బల్లకూప్పు గదిన్నీ దొరికినవి. ఆ చర్చి హాలులో పిల్లల తరగతులు పెట్టుకోడానికి నిశ్చయించాడు. ఆడపిల్లలు, మగపిల్లలు కలిసి ముప్పది మంది పిల్లలతో ౧౮౮౧ జూలై ౪వ తేదీని పాఠశాల ప్రారంభించాడు. ఈ పిల్లలికి పుస్తకాల చదువు నేర్పడానికి ముందుగా వీళ్లకి నేర్పవలసిన సంగతులు చాలా వున్నాయని త్వరగానే వాషింగ్టను గ్రహించాడు. మానవజీవితానికి ముఖ్యావశ్యకములైన అనేక సంగతులు ఈ పిల్లలకు తెలియవు. వీళ్ళకు స్నానం చేయడం ఎలాగో తెలియదు. శరీరం శుభ్రముగా ఉంచుకోవడం తెలియదు. ఏది తినదగినదో తెలియదు. ఆఖరుకు ఎలా తినాలో కూడా తెలియదు. తమ గది ఎలా వుంచుకోవాలో అసలే తెలియదు. వీళ్ళకి చదువుతో పాటు ఇవన్నీ నేర్పాలి. ఇంతే కాదు. వీనితోపాటు సాధ్యమైనంత తక్కువ శ్రమతో ఎక్కువ ఫలప్రదంగా ఉండే వ్యాపార పరిశ్రమలు కూడా వీళ్ళకు చెప్పాలని మన వాషింగ్టను నిశ్చయించాడు. ఈ చదువు పూర్తి అయి వీళ్ళు బయటి ప్రపంచంలోకి వెళ్ళి పడేటప్పటికి వీళ్ళు తమ బ్రతుకు తాము బ్రతుకడానికి శక్తి కలిగించే పారిశ్రామిక విద్య బోధించి వీళ్ళని బాగా తర్ఫీదు చెయ్యాలని వాషింగ్టను ఉద్దేశం. నిగ్రోలలో నూటికి ౮౦ మందికి జీవనం వ్యవసాయమే. అందువల్ల చదువుకొనే పిల్లలలో చాలామందికి విద్య పూర్తి అయ్యేటప్పటికి వాళ్ళు తమ పొలాలకు మళ్ళీ వెళ్ళి వ్యవసాయం పనులు చక్కగా నిర్వహించుకునే శక్తి కలగాలి. ఈ

పిల్లలు అభ్యసించే విద్య వీళ్ళకు మానసిక వికాసం కలిగించి విజ్ఞానము మతధర్మాలు బోధించడమేగాకుండా వీళ్ళకు వ్యవసాయంలోను కృషిలోను శక్తి సామర్థ్యములను కలిగించాలి. ఇతడు అందుకోసం పాటుపడడానికి నిశ్చయించాడు.

ఇతడు పాఠశాల ప్రారంభించిన మూడు నెలలలో దగ్గరలో నున్న ఒక పెద్దతోట, పొలము అమ్మకానికి వచ్చాయి. ఎలాగైనా ఈ ఆస్తిని కొంటే తన మనస్సుకు నచ్చిన పద్ధతులన్నీ అమలులో పెట్టడానికి వీలుగా వుంటుందని వాషింగ్టనుకు తోచింది. తనదగ్గర డబ్బు లేదు. అందువల్ల హాంప్టను విద్యాలయ కోశాధ్యక్షుణ్ణి ఆశ్రయించి २०० డాలర్లు బదులు పుచ్చుకొని ఈ క్షేత్రాన్ని కొని తనపాఠశాలను వెంటనే దానిలోనికి మార్చాడు. ఈ కొత్త తోటలో కూడా ఒక బల్లలగది, ఒకచిన్నకుటీరము, ఒకకోళ్లగుడిసె వున్నాయి. ముందుగా వాటిని కాస్త బాగుచేసి విద్యార్థుల సహాయంతోనే అడివిగా పెరిగిన చెట్లను నరికి భూమిని దున్ని సాగుచేయడానికి నిశ్చయించాడు. ఈ మాట విద్యార్థులతో చెపితే వాళ్ళకు నచ్చలేదు. చెట్లు నరికి వ్యవసాయం చేయడం ప్రారంభించడానికీ చదువుకీ ఏమి సంబంధ మని వాళ్ళు వితర్కించారు.

అనేకవేల సంవత్సరాలనాటి వైదిక సంప్రదాయాలుగల భారత దేశంలో విద్యానిలయాలుగా నుండే గురుకులాలలో బ్రహ్మచారులు గురువుగారి యింటెడుపని చేసి ఆయన పెట్టిన ప్రసాదం తిని ఆయన దగ్గర నాలుగుముక్కలు నేర్చుకొనే పద్ధతి మన దేశంలోనే అంతరించిపోయి ఇంగ్లీషుచదువులువచ్చి నెల జీతాలిచ్చి మంచి బిల్డింగులలో దొరలలాగ కూర్చుని ఒళ్ళు వంచకుండా పుస్తకాలు చదివి పనిచేయడం పరువు తక్కువ అనేభావం స్థిరపడి నిరుద్యోగం హెచ్చి బాధపడుతూ వుంటే ఇప్పుడు గాంధిమహాత్ముడు ఈ దాస్యంలోనుంచి తప్పించి మన పిల్లలకు విజ్ఞానము వృత్తివిద్య కలిపి నేర్పే విద్యామందిరాలు స్థాపించి దేశాన్ని ఉద్ధరించాలని ప్రయత్నిస్తూ వుంటే, మనవాళ్ళలోనే కొంత మందికి ఇది వెగటుగా నున్నప్పుడు, కేవలం దొరల పాఠశాలలు తప్ప ఇంకో పద్ధతే తెలియని నీగ్రోలకు ఇలా తోచడం ఆశ్చర్యం ఏముంది?

పనిచేయడం పరువుతక్కువ అనే అపోహ పోగొడితేనే తప్ప లాభం లేదని తలచి విద్యాధికుడైన వాషింగ్టను స్వయంగా ఒక గొడ్డలి పుచ్చుకొని బయలుదేరాడు. చెట్లు నరకడానికి ఉపాధ్యాయునికే పరువుతక్కువ లేకపోతే పిల్లలకేమి పరువుతక్కువ ? దానితోటి పిల్లలందరూ ఉత్సాహంతో నవ్వుమొహాలతో వచ్చి సాయపడ్డారు. చెట్లు నరికి భూమిని శుభ్రంచేసి సాగుచేశారు. గోధుమ, కూరగాయలు పండించారు. వ్యవసాయం చదువు వృద్ధిచెందడం ప్రారంభమైంది. పాఠశాలకూడా అభివృద్ధి చెందడం మొదలు పెట్టింది. పిల్లలు ఎక్కువ కాగా క్రొత్తకట్టడాలు అవసరం అయినవి. వాషింగ్టను ధైర్యంతో ఇటుక తీయుట, తాపీపని, వడ్రంగం, కమ్మరం ప్రారంభించి పిల్లల చేతనే ఇళ్ళు కట్టించడానికి నిశ్చయించాడు. "మన విద్యాలయంలో నేర్పే విద్యలో మొదటిపాఠము ఇటుకలు చేయడమే" అంటూ తాను అడుసు త్రొక్కాడు. వాళ్ళచేత త్రొక్కించాడు. తాపీపని చేయించాడు. వడ్రంగం చేయించాడు. ఇలాగ పాఠశాలకు ఇళ్ళు తయారయినాయి; విద్యార్థులలో మేస్త్రీలున్నూ, తయారయినారు. బుకర్ వాషింగ్టను ఆధిపత్యంక్రింద టస్కీజీ పాఠశాల పనిచేసిన ౧౯ సంవత్సరాల కాలంలో కట్టిన నలభై కట్టడాలలో నాలుగు తప్ప తక్కిన బిల్డింగులన్నీ పిల్లలు కట్టినవే. దారి తెన్ను లేక అల్లాడే నీగ్రోజనానికి విద్యాబుద్ధులు జీవనాధార మార్గాలు చూపించే పాఠశాలను వాషింగ్టను స్థాపించాడు.

ఈ టస్కీజీ నార్మల్ ఇండస్ట్రియల్ ఇన్‌స్టిట్యూట్ ౧౮౮౦లో శాసనసభవారు చేసిన తీర్మానం ప్రకారం ౧౮౮౧ లో స్థాపింపబడినదిగాని దీని అభివృద్ధికి కారకుడు మన వాషింగ్టనే. ఇది దినదిన ప్రవర్థమానమైనది. ౧౯౧౨ నాటికి ఈ పాఠశాలలో విద్యార్థులు, ఉపాధ్యాయులు, ఇతర ఉద్యోగులును, పనివాళ్ళు, వాళ్ళ కుటుంబాలును కలిసి జనసంఖ్య రెండువేల మందికి పెరిగింది. ఉపాధ్యాయులే ౧౯౩ మంది వృద్ధి అయ్యారు. ౧౯౧౨ లో ౧౬౮౪ మంది విద్యార్థులు. వీరిలో ౧౦౬౭ మంది బాలురు. ౬౧౭ మంది బాలికలు. ఈ విద్యాశాలకు ౨౩౪౫ యకరాలభూమి, ౧౦౭ బిల్డిం

గులు అమరినాయి. ఇదిగాక కాంగ్రెస్‌వా రిచ్చిన ౨ కోట్ల ౫౦ లక్షల డాలర్ల విలువచేసే ౨౫౫౦౦ యకరాలభూమిలో అమ్మగా మిగిలిన ౧౯౯౧౦ యకరాలు, ౧౮౭౧౯౮౭ డాలర్ల మూలధనం ఈ విద్యాశాలకు అమరింది. సాలుకు ౨౭౦,౦౦౦ డాలర్లు ఖర్చు. ఈ విద్యాలయంలో వ్యవసాయశాఖగాక వ్యవసాయ పారిశ్రామిక వృత్తి కళల శాఖలు, వృత్తులు ౮౦ రకాలవియున్నవి. బాలికలకు నర్సుల తర్ఫీదు పాఠశాల ఇంకా అనేక వృత్తులు నేర్పు శాఖలు వున్నాయి.

ఈ విద్యాలయంవారు సాగుచేసే పొలం ౨౨౩౦౦ యకరాలు. సమృద్ధిఅయిన పాడిపంట లున్నాయి. కోళ్ళు, బాతులు, పశువులు, మేకలు చాలా భారీగా పెంచుతారు. ఒక మ్యూజియంలో రకరకాల మంటిపొరలు ప్రదర్శించి భూసారమును గురించిన్నీ భూగర్భ విజ్ఞానమును గురించిన్నీ ఉపన్యాసాలలో ప్రత్యక్ష ఉదాహరణములతో చెప్తారు. ప్రత్తిపంట ప్రశస్తతరంగా చేయడానికి ౧౯౦౫ లగాయతూ అనేక ప్రయత్నాలు చేస్తున్నారు.

యంత్రపరిశ్రమలు బోధించే "వర్క్‌షాపు" లో ఈ క్రింది వ్యాపార పరిశ్రమలు నేర్పటానికి ఏర్పాటులు చేయబడినవి. వడ్రంగము, కర్రపని, అచ్చు, కుట్రుపని, కమ్మరం, జీనులు చేయడం, బళ్ళుచేయడము, కొళాయిలపని, ఉక్కు ఫిట్టింగు, విద్యుచ్ఛక్తి దీపాలు, తాపీపని, మెకానికలు డ్రాయింగు, టిన్నింగు (కళాయి), స్టీము ఇంజనీరింగు, చెప్పులు కుట్టడము.

ఆడపిల్లల వ్యాపార పరిశ్రమలలో నీ క్రిందివి చేరినవి:- బట్టలు ఉతకడము, వంట, బట్టలు కుట్టడము, మిలినరీ (బనియనులు, స్టాకింగులు లేసు అల్లిక) పని. పాఠశాలలోని ఆడపిల్ల లందరూ గృహనిర్వాహకవిద్య వంటపని నేర్చుకోవాలి. పాఠశాలవారు ఇచ్చే వెచ్చాలతో వాళ్ళు తమ వంట తామే చేసుకోవాలి.

ఇదిగాక కేవలము పుస్తకాలచదువు-చదవడము-వ్రాయడము, లెక్కలు, సాహిత్యవిద్య, నేర్పే శాఖకూడా వున్నది. పిల్లలందరూ ఈ చదువుకూడా నేర్చుకోవాలి. అయితే పిల్లల పారిశ్రామికవిద్యతో ఈ

విద్య మేళవించబడుతుంది. ౫౨ మంది ఉపాధ్యాయులు, ఇంగ్లీషు లెక్కలు, చరిత్ర, భూగోళము, శాస్త్రవిజ్ఞానము, బుక్కు-కీపింగు, జంత్రశాస్త్రము, కిండర్ గార్టెను, చిత్రలేఖనము, దస్తూరీ, శరీర వ్యాయామము నేర్పుతారు.

ఉపాధ్యాయులు క్రొత్తవిశేషాలు నేర్చుకోడానికి ప్రతియేటా వేసంగిపాఠశాల యేర్పాటుచేస్తారు. సెల్ఫు బైబిలు ట్రెయినింగు స్కూలులో క్రైస్తవమత ధర్మాలు బోధిస్తారు. దీనిలో చేరినవారిని మతబోధకులుగా తయారుచేస్తారు.

౧౮౯౨లో ఒకఆసుపత్రి నర్సుల ట్రెయినింగుస్కూలు స్థాపింప బడింది. ౧౮౯౪ నుండి ౧౯౧౨ నాటికి ౭౪ మంది నర్సులు విద్యనేర్చి దేశంలో వివిధభాగాలకు పోయి పనిచేస్తున్నారు. ఇదిగాక ఈ పాఠశాల జనసామాన్యానికికూడా విజ్ఞానం బోధించడానికి కృషిచేస్తూ నీగ్రో జాతీయోద్ధరణకు ఒక కేంద్రంగా వుంటూవుంది. ౧౮౯౭ లో రైతుల కొరకు ఒక విద్యాలయమును స్థాపించింది. పాఠశాలలో అవలంబింప బడుతూవున్న కొత్తపద్ధతులు రైతులకు బోధిస్తుంది వారికి రెండువారాల తర్ఫీదు ఇస్తుంది. ౧౯౦౭లో ఒక ప్రదర్శన క్షేత్రాన్నికూడా స్థాపించింది. ఒక నీగ్రో సంత ఏర్పాటుచేసి వాణిజ్యానికి ప్రోత్సాహం యిచ్చింది. దీనికితోడు ఒక జాతీయ నీగ్రోవ్యాపార సమితి స్థాపింప బడింది. (Rural School extension) గ్రామస్థుల ఉపయోగంకోసం ఒక గ్రామపాఠశాల, ఒకమాడల్‌స్కూలు, ఒకతోట, శిశుపోషణలో తల్లులకు తర్ఫీదు నివ్వడానికి తల్లుల క్లబ్బున్నూకూడా స్థాపించబడినవి.

ఈ విద్యాలయంలో మొదటినుంచీ ఒకవిధమైన సైనికశిక్షణ క్రమపద్ధతీ వున్నవి. ఆడపిల్లలనుకూడా క్రమశిక్షణలో వుంచడానికి స్త్రీశాఖఅధికారిణిని నియోగించారు.

ఈ విద్యాలయంకోసం ఒక పెద్ద గ్రంథాలయం స్థాపించబడింది. దీనిలో ౧౯౦౦౦ పుస్తకాలు చేర్చబడినవి. నీగ్రోలనుగురించీ ఆఫ్రికా దేశాన్నిగురించీ, నీగ్రోజాతీయతనుగురించీ ప్రబోధం కలిగించే పుస్తకాలు, పత్రికలు సమకూర్చి ఉంచేవారు. చుట్టుపట్లజిల్లాల గ్రామాల

లోని పాఠశాలలకు ఈ గ్రంథాలయంలోనుంచి పుస్తకాలు పెట్టెలలో పెట్టి పంపించేవారు.

నీగ్రోల విద్యాభివృద్ధికోసం వాషింగ్టను ఇలా తనయావజ్జీవితము పాటుపడి ౧౯౧౫లో దివంగతుడైనాడు.

౧౯౩౭–౩౮లో ౩౦ రాష్ట్రాలనుండి ౯ విదేశాలనుండి వచ్చిన ౩౩౩౩ పిల్లలకు టస్కీజీ విద్యాదానం చేసింది.

వాషింగ్టను తలపెట్టినకార్యం క్రమక్రమంగా పెరిగి దానికి చాలాసొమ్ము కావలసివచ్చింది. దేశప్రభువులైన తెల్లవారితోడ్పాటు కావలసివచ్చింది. ఇందుకొరకు అతడు ప్రచారం చేయవలసివచ్చి ఉపన్యాసాలు ఇవ్వడం ప్రారంభించాడు. ఇతని త్యాగమ్ము, ఓర్పు, పట్టుదల, ఇతని వాక్పటుత్వము తెల్లవారినికూడా ఆకర్షించినవి. కొద్దిరోజులలో ఇతడు గొప్ప వక్తఅని పేరుపొందాడు. అమెరికా సంయుక్త రాష్ట్రాలన్నీ సంచారం చేశాడు. ౧౮౯౫లో అట్లాంటా కాటన్ స్టేట్సు ప్రారంభించిన అంతర్జాతీయ ప్రదర్శనము సమయమున ఇత డిచ్చిన ఉపన్యాసము తెల్లవారికి నీగ్రోలకు స్నేహభావము కలిగించడానికితోడ్పడి చాలా ప్రసిద్ధిజెందినది. విదేశంలో అన్యజాతులమధ్య జీవనం చేయువారా దేశములోని జాతులస్నేహము సంపాదించడం అవసరమనినొక్కిచెప్పినాడు. ఒక కలం పుచ్చుకొని వ్రాయడంలో ఎంత గౌరవంవుందో ఒక నాగలిపుచ్చుకొని పొలం దున్నడంలో కూడా అంతగౌరవం వున్నదని గ్రహించేవరకూ ఏజాతీ కూడా బాగుపడదని చాటినాడు. మనకుగల అవకాశాలు ఉపయోగించుకోకుండా కష్టాలు లెక్కపెట్టు కుంటూ కూర్చుంటే లాభం లేదన్నాడు. కేవలం సంఘానికి సంబంధించిన ముఖ్యవిషయాలలో చేతివేళ్ళలాగ విడిగా వుండవచ్చును కాని, దేశానికి సంబంధించిన ముఖ్యవిషయాలలో మాత్రం అరచేతిలాగ ఏకంగానే ప్రవర్తించాలని అన్నాడు!

౧౮౯౮ లో అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్షుడు టస్కీజీ వచ్చి చూచి చాలా సంతోషించాడు. బుకర్ వాషింగ్టను పైన గౌరవాలు వర్షించడం ప్రారంభమైంది. విశ్వవిద్యాలయాలు గౌరవ బిరుదు లిచ్చినవి. అన్ని రాష్ట్రాలవారు ఆహ్వానించి గౌర

కూర్చోమన్నది. జగన్నాథక్షేత్రంలోలాగనే రాజపుత్రస్థానంలోని సంస్థానాలలో వంటవాళ్ళందరూ మంగలికులస్థులు. వారు చాలా నమ్మకంగా వుంటారు. ఆ మంగలి పన్న చెప్పిన ప్రకారం ఆ గంప తీసుకుని బైలుదేరినాడు. మిగిలిన అన్నం కూరలు తీసుకొని పోతు న్నాడు కాబోలునని కావలివారు అటకాయించలేదు.

అక్కడ అంతఃపురంలో పన్న రాజకుమారుడి బట్టలూ, నగలూ తన కుమారుడికి తొడిగిందో లేదో ఇంతలో వనవీరుడు కత్తిపుచ్చుకొని వచ్చి "నీవు పెంచుతూవున్న రాజకుమారు డేడీ?" అని అడిగాడు పన్న నిలువునా నీరైపోయింది. తన కొమారుడికి ఆయువు చెల్లిపోయిన దని అవగతమై అతనికి జవాబు చెప్పలేక కొంతసేపు నిశ్చేష్టురాలై తరువాత ధైర్యము తెచ్చుకొని నిద్రపోతూవున్న తన కొమారుడి వైపునకు చేతితో చూపించినది. వనవీరు డాపిల్లవాడి తల నరికి వేశాడు. పిల్లవా డాతల్లి ఎదుటనే మరణించాడు. వనవీరుడు రాజ్యం నిష్కంటకమైన దనుకొని వెళ్ళిపోయాడు.

ఆ పిల్లవాడికి రాజకుమారుడి కివికి తగినట్లుగా దహనక్రియలు జరిపారు. పన్న ఏడ్పుచూసి పాపం రాజకుమారుణ్ని పెంచిన ప్రేమ అని అనుకున్నారేగాని ఆవిడ తన గర్భశోకమే అనుభవిస్తూవున్నదని తెలుసుకోలేదు. తరువాత పన్న కోట వదలి ఊరివెలుపలకు పోయి రాజకుమారుడిని తీసుకుని చిత్తూరు రాజ్యమున కిదివర కనేకమారులు అఖండమైన సేవ చేసిన దేవలనగరరాజైన బాగ్జిగారి కుమారుడి దగ్గరకు తీసుకొనిపోయినది. అత డావిడను, పిల్లవాడిని ఆదరించాడు; కాని వనవీరుడు దగ్గరలో నున్నందువల్ల తనను బ్రతకనివ్వడని ఆవి డకు, రాజకుమారుడికి ఆశ్రయ మివ్వలేకపోయాడు. అక్కడనుంచి తంజపురమునకు పోగా అక్కడ కూడా ఇలాగే జరిగింది. చివర కామె కమలమియరుకోటలో కాపురం చేస్తూవున్న జైనమతస్థుడైన అస్సా యనే యొకకోమటి నాశ్రయించినది. అతడు సహజ ముగనే భయపడినాడు కాని పున్నసాహసౌదార్యములను, ప్రభు భక్తినీ చూసి ఆశ్చర్యపడి ఆవిడదుస్థితికి జాలివహించి అస్సాతల్లి అతనికి ధైర్యము చెప్పి తమ రాజైన రాణాసంగుని మూడవకొమారు

డైన ఈ ఉదయసింగును రక్షించుమని బోధించగా ఉదయసింగును తన మేనల్లుడని చెప్పి తనవద్ద ఉంచుకొంటా ననిన్నీ, పన్న అక్కడ ఉంటే అనుమానం కల్గుతుందనిన్నీ అతడు అన్నాడు. అంతట ఎక్కడనో అక్కడ రాజపుత్రుడు బ్రదికివుంటే చాలునని పన్న అతనిని వదల లేక వదలలేక విడిచిపెట్టి వెళ్ళింది.

ఉదయసింగు కమలమియరు కోటలో పెరుగుతున్నాడు. అతడి లక్షణములు, చర్యలు చూసి ఇతడు రాజపుత్రుడేకాని కోమటిబిడ్డడు కాడని క్రమక్రమంగా అందరికీ తెలిసిపోయింది. (దీనిని గురించి రాజ స్థాన కథావళిలో అనేక కథ లున్నవి.)

ఇలా వుండగా వనవీరునిచేత అవమానింప బడిన రాజపుత్రు లందరూ ఉదయసింగు బ్రదికివున్నాడనే సంగతి పన్నను, మంగలిని విచారించి తెలిసికొని అతనికి సహాయం చెయ్యడానికి పూనుకున్నారు. అయితే చిత్తూరు దుర్గం దుర్భేద్యమైనది. అందువల్ల దానిని పట్టుకోవ డానికి ఉపాయాలు ఆలోచిస్తూ, వనవీరుడిచేత అవమానింప బడిన అతడి మంత్రితో కూడా ఆలోచించారు. ఇంతలో వనవీరుడి కుమార్తె పెళ్ళి వచ్చింది. ఆ సందర్భంలో కోటలోకి వచ్చే సరుకుల బళ్ళలో రాజపుత్రులు కూర్చుని కోటలో ప్రవేశించి దానిని స్వాధీనం చేసు కొన్నారు. వనవీరుడు పారిపోయాడు. విక్రమశకం ౧౫౯౭ (క్రీ. శ. ౧౫౪౧) లో ఉదయసింగు రాజైనాడు.

'పన్న' యనే మాటకు హిందీ భాషలో వజ్రమని అర్థము. ఆ పేరు మన పన్నవిషయంలో సార్థకమైంది. పన్నాబాయి చిత్తూరు రాజ్య రమామణియైనది. ఆవిడపేరు చరిత్రప్రసిద్ధ మైంది. హిందూ దేశమంతటా మారుమోగింది. రాజస్థానంలో ఆవిడను గురించిన పాటల నిప్పటికి పాడతారు. ఆవిడగతించిన కొన్నివందల సంవత్స రాలకు కర్నల్‌టాడ్ అనే ఆంగ్లేయుడు తాను రచియించిన రాజస్థాన కథావళిలో నీమెచరిత్ర నతి రసవంతంగా వర్ణించాడు.

---

(Annals of Mewar, — Tod's Rajastan Vol. I pp 328-344.)

## పెద్దాపుర రాజవంశాన్ని నిలిపిన లక్ష్మీసోదెమ్మ

ఈ హిందూదేశము శాంతి సత్యత్యాగ ధైర్యసాహసౌదార్యాలకు పుట్టినిల్లు. పన్నాబాయిలాగ ధర్మరక్షణకోసము తమ సర్వస్వము నర్పించిన స్త్రీ పురుషులును ప్రాణము లర్పించిన స్త్రీ పురుషులును కూడా ఈదేశంలో అన్నికులాల వారిలోనూ, అన్నికాలాలలోనూ ఉన్నారు. అందువల్లనే ఎన్ని రాజకీయ మతసాంఘిక క్షోభలుతటస్థించినా ధర్మ మంటూ ఇంకా నిలిచియున్నది.

పన్నాబాయి గతించిన రెండువందల సంవత్సరాలలోనే మళ్ళీ అలాంటి పుణ్యచరిత్రి యొకావిడ మన తెలుగు దేశంలో జన్మించి మన జాతికి కీర్తితెచ్చింది. ఆమెపేరు కొంపెల్ల లక్ష్మీసోదెమ్మగారు.

మొగలుచక్రవర్తియైన ఔరంగజేబు క్రీ. శ. ౧౭౦౭ లో చనిపోగా మొగలాయి సామ్రాజ్యంలో చేరిన వివిధరాష్ట్రాలను పరిపాలించే నవాబులు క్రమక్రమంగా స్వతంత్రులై పరిపాలించసాగినారు. మొగలాయి సామ్రాజ్యాంతర్భాగమైన గోలకొండ రాష్ట్రానికి సుబేదారుడైన కమ్రుద్దీన్ అసఫ్‌జాగారు "రాజ్యనిర్వాహకుడు" (Regulator of the Kingdom) అనే అర్థంగల "నిజాం ఉల్ ముల్క్" అను బిరుదును వహించి తన రాజధానిని గోలకొండనుంచి హైదరాబాదుకు మార్చి ౧౭౨౪ మొదలు దక్షిణ హిందూదేశాని కంతా రాజాధిరాజుగా పరిపాలించడం ప్రారంభించాడు. గోలకొండరాష్ట్రం క్రింద నున్న ఆర్కాటు, కర్నూలు రాజమహేంద్రవరం చికాకోలు పరగణాలను ఆయా ప్రాంతాల కధికారులుగా నియమింపబడిన నవాబులు పరిపాలించేవారు. తరువాత కొంతకాలానికి కర్నాటక నవాబు అని చరిత్ర ప్రసిద్ధుడైన మహమ్మదాలీ వాలాజా నవాబుగారి తండ్రి అన్వరుద్దీనుగారిని నిజాముగారు రాజమహేంద్రవరం చికాకోలు పరగణాలకు నవాబుగా నియమించారు.

అన్వరుద్దీను ౧౭౧౪-వ సంవత్సరంవరకూ ఈప్రాంతాలను పరిపాలించాడు. తరువాత ౧౭౪౩ లో నిజాముగా రాయనను ఆర్కాటు నవాబుగా నియమించగా అక్కడికి వెళ్ళిపోయినాడు.

అన్వరుద్దీనుగారు తనక్రింద ఫౌజుదారు (సేనాపతి)గా నున్న రుస్తుంఖానును ఈ ప్రాంతాలకు పరిపాలకుడుగా నియమించాడు. రుస్తుంఖానుడు ౧౭౩౨ సంవత్సరంనుంచి రాజమహేంద్రవరంలోనే వుంటూ దేశపరిపాలన జరిగించాడు. అప్పట్లో ఆ ప్రాంతాలలో శిస్తులను వసూలు చేయడానికి నియమింపబడియున్న యిజారాదారులనే జమీందారులకు ఇతడు సింహస్వప్నంగా నుండేవాడు. శిస్తులు వసూలు చేయడంలో అక్రమాలు జరిపి ప్రజలను పీడించినారనిగాని, వసూలు చేసిన శిస్తును సర్కారుకు తిన్నగా జమకట్టక హరించారనిగాని నేరాలు మోపి వారిని పట్టుకుని అతిక్రూరముగా దండించేవాడు. కొందరిని వధించాడు. వారి స్థానే తురకలనే అమీనులుగా నియమించాడు. తాను వధించిన జమీందారుల పుర్రెలతో రాజమహేంద్రవరంలో ఒక స్తంభమును, బందరులో ఒక స్తంభమును కట్టించాడని చెప్పుకుంటారు. ఇలాగ ఆకాలంలో రుస్తుంఖానుడి పేరు మారుమ్రోగింది. ఈ రుస్తుంఖాను మొదట పెద్దాపురం కాపురస్థుడైన తెలుగు ముసల్మానుడేనని, అతడు తన తెలివి తేటలచేత పైకి వచ్చి అన్వరుద్దీను దగ్గర ఫౌజుదారుడై దేశపరిపాలకుడైనాడని కూడా చెప్పుకుంటారు.

పెద్దాపురం గోదావరిజిల్లాలో రాజమహేంద్రవరానికి ఈశాన్య దిక్కున కొంచెము తూర్పుగా ౨౮ మైళ్ల దూరములో నున్నది. ఈ సంస్థానం యొక్క ప్రశంస క్రీ. శ. ౧౫౭౧ నుంచి చరిత్రలో కనబడుతూ వున్నది. పెద్దాపురం జమీందారులైన వత్సవాయవారు క్షత్రియులు. వీరు విజయనగరరాజులకు దగ్గర బంధువులు. పూర్వం ఈ ప్రాంతాల నేలిన రెడ్డిరాజుల దగ్గర వత్సవాయవారు సరదారులుగా నుండి దేశాక్రమణలోనూ, దేశపరిపాలనలోనూ వారికి సహాయభూతులుగా నున్నందువల్ల రెడ్డిరాజులు వీరికి మొదట హిమ్మ్మారు పరగణాలోని కొన్నిభూముల నిచ్చి తరువాత ఆపరగణానే జాగీరుగా నిచ్చినారనిన్ని తెలుస్తున్నది. ఈ ప్రాంతాలలో శిస్తులు వసూలుచేసే యిజారాదారు దేశముఖులలో పెద్దాపురంవారే ముఖ్యులు. తరువాత వీరు పెద్ద జమీందారులై రాజలాంఛనాలతో దేశపరిపాలన చేస్తూ

వచ్చినారు. ఈవత్సవాయవారు తమ బాహుబలపరాక్రమం వల్లను, రసికతవల్లను దాన ధర్మాలవల్లను చాలా ప్రఖ్యాతిని పొందినారు.

పెద్దాపురం సంస్థానమును పరిపాలించిన వత్సవాయ పినరాజు గారి తండ్రిగారికి హైదరాబాదు నవాబుగారు 'జగపతిరాజు' అనే బిరుదునిచ్చినట్లున్నూ, అప్పటినుంచీ ఈ రాజులు ఆనామంతో వ్యవహరింపబడుతూ వున్నట్లున్నూ చెపుతారు.

౧౬౮౯ మొదలు ౧౭౦౮ వరకూ పెద్దాపురము నేలిన సార్వభౌమ తిమ్మజగపతిరాజుగారి యనంతరము వారి సోదర పుత్రులైన శ్రీరాయజగపతిరాజుగారు రాజ్యమునకు వచ్చి విభవ సంవత్సర ఫాల్గుణబహుళ ౧౪ లు మొదలు మన్మథ నామసంవత్సర జ్యేష్ఠశుద్ధ ౪ వరకు ౨౬ సంవత్సరములు పెద్దాపురాన్ని పరిపాలించినారు. వీరిని శ్రీమదుద్దండరాయ జగపతిరాజుగారని అనేవారు. వీరి భార్యపేరు రాగమ్మాదేవిగారు, వీరికి తిమ్మభూపతి, బలభద్రక్షితిపతి, నూరనృపతి యని ముగ్గురు కుమాళ్లుండేవారు.

రాయజగపతిరాజుగారు చచ్చిపోయేటప్పటికి వారి కుమాళ్ళెవ్వరూ యుక్తవయస్సు వచ్చినవారు కారు. అంతట రాగమ్మాదేవిగారు తమ పెద్దకుమారుడైన తిమ్మజగపతిరాజుగారిని పట్టాభిషిక్తులుగా చేసి తామే రాజ్యంచేయడం ప్రారంభించారు. ఈతిమ్మజగపతిరాజుగారు కళలందు నిపుణులుగా నున్నందువల్ల కళా తిమ్మజగపతి యని పేరు పొందినారు. శ్రీ రాగమ్మాదేవిగారికి రాఘవమ్మగారని నామాంతరం వుండేది. ఆవిడ క్రీస్తుశకం ౧౭౧౪ మొదలు ౧౭౩౪ వరకూ పెద్దాపురాన్ని అతిసమర్థతతో పరిపాలించారు.

ఆకాలంలో ఉత్తరసర్కారులు పేరుకు మొగలాయిచక్రవర్తిగారి ప్రతినిధిగానున్న హైదరాబాదు సుబేదారుడైన నిజాముగారి అధికారానికి లోబడివుండేవి. హైదరాబాదునవాబుగారి సేనాధిపతులు ఈప్రాంతాలను ఎప్పటికప్పుడు లోబరుచుకోవలసివచ్చేది. రుస్తుంఖాను రాజమహేంద్రవరానికి 'షర్ లష్కర్' హైదరాబాదు నవాబుగారి అధికారం స్థాపించడానికి వస్తూవున్న సంగతి తెలియగానే అతడిక్కడికి రాకుండా అరికట్టాలని మొగలితుర్రు పరిపాలకుడైన కలిదిండి

రామరాజుగారున్నూ, నూజివీటి సుబ్బన్నగారున్ను ఏలూరుదగ్గర అతణ్ని అటకాయించారు గాని లాభంలేకపోయింది. పిఠాపురంవారు కూడాఓడిపోయి మన్యంలోకి పారిపోయారు.

రుస్తుంఖాను పెద్దాపురంమీదికి దాడిచేశాడు కాని ఆకోట పట్టుకోవడం అతనికి సాధ్యంకాలేదు. అంతట అతడు సామ దాన భేదోపాయాలు ప్రయోగించి కళా తిమ్మజగపతిగారిని, వారి సోదరులను తన గుడారంలోనికి రప్పించి మోసంచేసి వారిమీద సలసలకాగే వేడినూనె పోయించి చంపించాడు. ఈ దుర్వార్త వినగానే అంతఃపురంలో కళా తిమ్మజగపతిగారి భార్యయున్నూ, ఆయన తల్లియైన రాగమ్మా దేవిగారున్నూ, తక్కిన రాణివాసస్త్రీలున్నూ అగ్నిప్రవేశం కావడానికి నిశ్చయించారు.

కళా తిమ్మజగపతిరాజుగారు దుర్మరణం పొందేనాటికి ఆయనకు జగపతిరాజు గారనే ఏడుమాసముల వయస్సు గల కుమారుడున్నాడు. ఈపసిపాపడిని పెంచి పెద్దవాణ్ని చెయ్యడానికైనా ఎవరూ మిగలకుండా శ్రీరాగమ్మా దేవిగారితో పాటు ఆవిడ కోడళ్లూ, ఇతర రాణివాస స్త్రీలందరూ కూడా అగ్ని ప్రవేశం చెయ్యడానికి నిశ్చయించారు. విజయనగర రాజైన పూసపాటి సీతారామచంద్రరాజు గారున్నూ, కళా తిమ్మజగపతిరాజుగారున్నూ తోడియల్లుళ్ళు. పిల్లవాణ్ని విజయనగరానికి చేర్చి పినతల్లికి వప్పగిస్తే పెద్దాపురం రాజవంశం నిలుస్తుంది. అయితే ఇది చెయ్యడం ఎలాగనని రాగమ్మా దేవిగా రాలోచించారు. రుస్తుంఖాను క్రూరకృత్యాలను చూస్తూ వున్నవారెవ్వరూ అంత ధైర్యం చెయ్యడానికి సాహసించ లేరు. పెద్దాపురం రాజుగారి కొలువులోనున్న విశ్వాస పాత్రులైన రాజసేవకులలో ఎవరైనా దీనికి సాహసించినా రుస్తుంఖానుడు వారినీ, పిల్లవాణ్ణీ బ్రతకనివ్వడు. అందువల్ల రాగమ్మా దేవిగారు కర్తవ్యం ఆలోచించారు.

ఆలోచించగా ఆలోచించగా పిల్లవాడిని విజయనగరానికి పంపి రక్షించే విషయంలో రాగమ్మా దేవిగారి కొక ఉపాయం తోచింది. కొంపెల్లవారు పెద్దాపురంరాజుల కాశ్రితులైన పురో

హితులు. అప్పటి రాజపురోహితుడి భార్య లక్ష్మీ సోదెమ్మగారు చాలా దొడ్డ యిల్లాలు. ఆవిడమీద రాగమ్మాదేవి గారికి చాలా గౌరవం. తన మనమడిని ఆవిడ కప్పగిస్తే తన కోరిక నెరవేరుతుందని రాగమ్మాదేవి గారికి తోచింది. అంతట ఆవిడ సోదెమ్మగారిని తన కీసహాయం చెయ్యవలసిందని అడిగింది. సోదెమ్మగారావిడ కోరిక విని తెల్లపోయింది. తానేమో, తన యిల్లేమో, తన ఆచారాలేమో తప్ప ఆవిడకు ప్రపంచం సంగతే తెలియదు. తన భర్తయైనా కేవలమూ శిష్టాచార సంపన్నుడైన పరమఛాందసుడేగాని లౌకిక వ్యవహారాలు తెలిసినవాడు కాడు. అయితే కొన్ని పురుషాంతరాలనుంచీ తమ కుటుంబాని కాశ్రియంగా నున్న పెద్దాపురం రాజకుటుంబానికి సంప్రాప్తించిన ఈమహావిపత్తులో రాగమ్మాదేవిగారు అగ్ని ప్రవేశమవుతూ తన నీమాత్రపు సహాయం చెయ్యమని కోరితే తానెలా కాదనగలదు? ఏమైనాసరే ఈ పిల్లవాడి ప్రాణానికి తన ప్రాణం అడ్డువేసి అతణ్ణి కాపాడడానికి పూనుకొని సోదెమ్మగారు రాగమ్మాదేవిగారి కోరిక చెల్లిస్తానని ఆవిడచేతిలో చెయ్యివేసి వాగ్దానం చేసింది. అంతట రాగమ్మాదేవిగారు, కోడళ్ళు అగ్ని ప్రవేశం చేశారు.

ఆక్షణం నుంచి ఆవిడకే ఆశ్చర్యం కలిగించేటంత ధైర్య సాహసాలు, ఉపాయాలు లక్ష్మీ సోదెమ్మగారికి పుట్టుకొని వచ్చినవి. పిల్లవాడిని ఒడిలో వేసుకొని కోటవెలుపలికి వచ్చిందో లేదో రుస్తుంఖాను భటు లావిడను అటకాయించారు. "ఈ పిల్లవాడెవరు? ఎక్కడకు తీసుకునివెడుతున్నావు?" అని వాళ్ళు ఆవిడను ప్రశ్నించారు. అంతట ఆవిడకు అగ్నిపరీక్ష ప్రారంభమైంది. తానొక బ్రాహ్మణ స్త్రీనన్నీ, ఆపిల్లవాడు తన పిల్లవాడనిన్నీ, తాను రాగమ్మాదేవిగారిని చూసి వస్తున్నాననిన్నీ సోదెమ్మగారు వారికి చెప్పి వారికి నమ్మకం పుట్టడానికి పిల్లవాడిని ముద్దుపెట్టుకుని వాడి నోట్లో తన నోరు పెట్టి తన నోరు ఎంగిలిచేసుకొని తప్పించుకొని బయటపడి బ్రిదుకుజీవుడా యని తన యిల్లు చేరింది. ఇల్లలుకగానే పెళ్ళి కాదుకదా! ఇల్లు చేరగానే తన భర్తతో సంగతులన్నీ చెప్పి భర్తను, కొందరు భటులను వెంటతీసుకుని బయలుదేరి చేబ్రోలు మార్గంగా విజయనగరానికి దారితీసింది.

ఈ సంగతి రుస్తుంఖానుడి చెవిని పడగానే తన సైనికులను పంపించి సోదెమ్మగారిని, పిల్లవాడిని పట్టి తెప్పించాడు. అంతట సోదెమ్మగా రాపిల్లవాడు తన పిల్లవాడేగాని రాజుగారి పిల్లవాడు కాడని గోలచేసి యేడ్చింది కాని ఖానుడు వినిపించుకోలేదు. ఆపిల్లవాడి సంగతి కనుక్కుంటానని చెప్పి చంటిపిల్లవాడి ఎదుట కొన్ని పుస్తకములున్నూ, ఒక ఖడ్గమున్నూ పెట్టించి పిల్లవాడిని వదలగా వాడు ఖడ్గమువైపునకే పోయి దానిని పట్టుకున్నాడట. అంతట ఆ బాలుణ్ణిచూసి ఖానుడు "కూద కేషేర్, బక్రీకా బచ్చా నహీహై" (వీడు పులిపిల్లగాని మేకపిల్లకాదు) అని పిల్లవాడిని ఖైదులోనుంచి చుట్టూ కాపలావేశాడు. సోదెమ్మగారు ఎంతో గోలపెట్టి ఏడ్చింది. ఆవిడ ఖానుగారి భార్యదగ్గరకు పోయి తనకు పుత్రభిక్ష పెట్టవలసినదని యేడ్చింది. ఆఖరికి ఆవిడకూడా ఆచెరసాలలో వుండి పిల్లవాడిని పెంచడానికి ఖానుడు అంగీకరించాడు. అయితే పతిరోజూ ఉదయం తాను ముఖం కడుక్కునేటప్పు డాపిల్లవాణ్ణి తన సమక్షానికి తీసుకునిరావాలని భటులకు వుత్తర్వు చేశాడు. ఆ పిల్లవాడు రోజూ చూపించే విద్దెములను చూసి వాడు క్షత్రియ శిశువేగాని బ్రాహ్మణుడు కాడని ఖానుఅంటూ, వీడు బ్రదికివుంటే తనకు ముప్పు వస్తుందని ఆబాలుణ్ణి వధించాలని ఎప్పటికప్పుడు అనుకునేవాడట గాని తన భార్య మాటలవల్ల అలా చేయకుండా వుపేక్షించేవాడు.

సోదెమ్మగారు రాత్రింబగళ్లు ఆ పిల్లవాడిని కనిపెట్టుకుని వుండి వీలైనప్పుడల్లా రుస్తుంఖాను భార్యదగ్గరకు పోయి కడుపు తరుక్కుని పోయేటట్లు చెప్పుతుని ఏడుస్తూ తనకు పుత్రభిక్ష పెట్టవలసిందని పార్థిస్తూ వుండేది. రుస్తుంఖాను భార్యకు మనస్సు కరిగి తన భర్త ఆపిల్లవాడికి పాణాపాయం కలిగించకుండా కాపాడుతూ వుండేది.

ఇక్కడ పెద్దాపురంలో జరుగుతూవున్న సంగతి సందర్భాలన్నీ సోదెమ్మగా రెప్పటికప్పుడు తన భర్తగారిద్వారా విజయనగరానికి తెలియపరుస్తూ వుండేది.

అక్కడ విజయనగరంలో సీతారామచంద్రరాజుగారి పినతండ్రి కుమారుడైన విజయరామరాజుగారు రాజ్యకాంక్షవల్ల అన్నగారికి,

విషప్రయోగంచేసి చంపించారు. అంతట రామచంద్రరాజుగారి భార్యయున్నూ భర్తతో సహగమనం చేసింది. రాజ్యాకాంక్షవల్ల అన్నగారిని తుదముట్టించి సింహాసన మెక్కినా విజయరామరాజు గారు తన అన్న కుమారుడైన ఆనంద గజపతిగారిపట్ల విరోధభావం వహించక దయగానే చూసేవారు. అక్కడ పెద్దాపురంలో ఖైదులో నున్న బాలుడైన రాయజగపతిరాజుగారి మీదకూడా వారికి బంధు ప్రేమ, సానుభూతి పూర్తిగానే వున్నవి. విజయరామరాజుగారి భార్య చంద్రయ్యమ్మా దేవిగారు దొడ్డ యిల్లాలు. ఆవిడకు కూడా ఈ దిక్కు లేని పిల్లవాడిమీద చాలా దయ కలిగింది. అందువల్ల వారీపిల్లవాడిని ఎలాగైనా చెరలోనుంచి విడిపించాలని చాలా ఆదుర్దాగానే వున్నారు. ఇలావుంటూ వుండగానే కొన్ని సంవత్సరాలు గడిచి పోయినవి. పిల్లవాడు చెరసాలలోనే పెరుగుతున్నాడు.

ఇంతలో రుస్తుంఖాను కుమారుడైన నూరుద్దీనుఖాను తన తండ్రిని వధించి తానే రాజమహేంద్రవరానికి షర్‌లష్కరై పెద్దా పురంలోనే మకాముగానుండి పరిపాలన ప్రారంభించాడు. అయితే చెరలో నున్న రాయజగపతి రాజుగారికి విముక్తి కలుగలేదు. పైగా కొత్తఖాను బందోబస్తు ఎక్కువ చేశాడు. పిల్లవాడిని చంపిస్తాడనే భయం ఇంకాఎక్కువైంది. ఎందుకంటే రాజవంశమువాడంటూ వుంటే అతణ్ని సింహాసనం ఎక్కించడానికి కుట్ర చేస్తారని అతనిభయం. బాలుణ్ని ఖైదుచేసిన గదికిన్ని, కోటయొక్క బయటి ద్వారానికిన్ని మధ్య ఏడు పహరాలుండేవి. అక్కడ తురుష్కభటులు విచ్చుకత్తు లతో పారా యిచ్చేవారు. కోటలోపలికి పోవడానికి సోదెమ్మగారికి తప్ప మరెవ్వరికీ అనుజ్ఞ లేదు అందువల్ల పిల్లవాణ్ణి తప్పించాలంటే ఆవిడ ఒకర్తే ఈ పహరావాళ్ల నందరినిన్నీ తప్పించుకోవాలి. లక్ష్మీసోదెమ్మగారు అందుకోసం కొన్ని ఉపాయాలు ఆలోచించి అవకాశముకోసం చూస్తూవుంది. సోదెమ్మగారెప్పుడూ ముప్ఫైమూళ్ల బట్టకట్టుకొని దానిని తన నడుముచుట్టూ చుట్టలు చుట్టలుగా అనేక మార్లు తిప్పి చుట్టుకునేది. పహరావాళ్లాచీరచుట్టలు విప్పించి చూచి మరీ లోపలికి పోనిచ్చేవారు. ఇదేమిటని వారడిగితే ఇది మాయింటి

ఆచారమనేది. వాళ్ళు నవ్వుతుని కొన్నాళ్ళు చీరెచుట్టలు విప్పించి ఆఖరికి విసిగి వేసరి ఆ చీరచుట్టలు విప్పించడం మానివేశారు. ఆవిడ బహు తరుచుగా బైటకు వెడుతూవుండడం చూసి వాళ్ళు ఆవిడను ప్రశ్నించగా అది తన శరీర ప్రకృతి యని చెప్పేది. అది వాళ్ళు నమ్మి వూరుకున్నారు.

ఇలా వుండగా నూరుద్దీనుఖాను కళింగదేశ దండయాత్రకు బయలుదేరుతా డనే సంగతి తెలిసింది. అంతట తగిన సిబ్బందితో ఒక పల్లకీని పంపించవలసిన దనిన్ని, దారిలో అక్కడక్కడ అంచెలలో సైనికులను పెట్టవలసింద నిన్ని సోదెమ్మగారు విజయనగరానికి కబురు చేసింది. ఆ ప్రకారం పల్లకీ రాగా సోదెమ్మగారు బాలుణ్ని తన ఒడిలో వేసుకొని ఆపైన తన చీరను చుట్టి కాపలావారికి అనుమానం కలుగకుండానే పిల్లవాణ్ని బైటికి తీసికొనిపోయి సంకేతస్థలంలో వున్న పల్లకీలో ఎక్కి విజయనగరానికి దారితీసింది

సోదెమ్మగారు పిల్లవాడిని తీసికొనిపోయిన సంగతి తెలియగానే, ఈ సంగతి తెలిస్తే తమమీదికి వస్తుందని భయపడి రాత్రివేళ సోదెమ్మగారు తప్పించుకొని పోయిన దని కాపలావారు తమ ప్రభువుకు తెలియపరిచారు.

విజయరామరాజుగారి సైనికులు సోదెమ్మగారిని పల్లకీలో అంచెలమీద తీసికొనిపోతున్నారనే సంగతి చారులవల్ల తెలియగా నూరుద్దీనుఖాను వెంటనే తన సేనతో బయలుదేరి పోయాడు. చేబ్రోలు దగ్గర యుద్ధం జరిగింది. అక్కడ విజయనగరమువారి అనకాపల్లి బోయల ఫౌజు ౨౦౦౦ మంది నూరుద్దీనుఖాను ఎక్కిన ఏనుగును చుట్టడించి అంబారీయొక్క కట్టుపగ్గాలు తెంపి ఖానుణ్ని కిందికి లాగి అతనిని వధించగా అతని సైన్యం చెల్లాచెదరై పోయింది.

విజయరామరాజుగారు రీజగపతిరాజుగారిని సురక్షితంగా తీసుకుని పోయి అక్కడ తన అన్నకుమారుడైన ఆనందగజపతిరాజుగారితో సమానంగా చూస్తూ పెంచడం ప్రారంభించారు.

ఈ రాజమహేంద్రవరం వర్లమ్కారు పై యధికారియైన అన్వరుద్దీనుకు రుస్తుంఖానుమీదను,నూరుద్దీనుమీదనుకోపం వచ్చినందువల్ల

అతడూ విజయనగరంవారికీ, నూరుద్దీనుకూ జరిగిన యుద్ధంలో విజయ నగరంవారికే సహాయం చేశాడు. తరువాత పెద్దాపురం కోటను తానే స్వాధీనంచేసుకొని పరిపాలించసాగినాడు. అందువల్లకూడా పెద్దా పురానికి మోక్షం కలుగలేదు. కొంతకాలం తరువాత అన్వరుద్దీనుకు బదులుగా జాఫరల్లీఖాను ఈ నాలుగుపరగణాలకూ పరిపాలకు డైనాడు. అతడు విజయనగరం మీదికి దండెత్తి వచ్చాడు. అప్పటికి యుక్త వయస్సు వచ్చిన జగపతి రాజుగా రతని నెదుర్కొని జయించగా వారికి రాజీ జరిగినది. తరువాత జగపతిరాజుగారు ౧౭౪౯ లో పెద్దాపురానికి వచ్చి పట్టాభిషిక్తులై ౧౭౭౦ వరకూ పరిపాలించారు.

కొంపెల్ల లక్ష్మీనరసమ్మగారు ఇలాగ ఎన్నో కష్టా లనుభ వించి శ్రీరాయజగపతిరాజుగారిని రక్షించి విజయనగరమునకు సురక్షి తముగా తీసికొనిపోయి వప్పగించి పెద్దాపురం వత్సవాయివారి రాజ వంశం నిలిపి పుణ్యం కట్టుకుంది. ఈవిడ చూపిన అఖండమైన త్యాగ మునకు, సాహసౌదార్యములకు మెచ్చి విజయనగరం రాజుగారైన శ్రీవిజయ రామగజపతి మహారాజుగారు లక్ష్మీనరసమ్మగారి కుటుంబం వారికి తమ రాజ్యంలో ఒక అగ్రహార మిచ్చి దానికి లక్ష్మీనరపురాగ్ర హార మని ఆవిడపేరును పెట్టించారు. రాయజగపతిగారిని రక్షించి నందువల్లనే ఈ యగ్రహార మివ్వబడినందువల్ల దీనికి రాయభూపాల పురాగ్రహార మనికూడా పేరు. ఈ అగ్రహారాన్ని కొంపెల్లవారు చాలాకాలం అనుభవించారు.

కొంపెల్లవారు వత్సవాయివారికి చిరకాలం నుండి పురోహితు లుగా ఉన్నట్లు గోదావరిజిల్లా మోడేకుర్తి వాస్తవ్యులైన బ్రహ్మశ్రీ కొంపెల్ల సుబ్బరాయశాస్త్రిలవారు సిద్ధాంతశిరోమణికి వ్రాసిన ఆంధ్ర పీఠికలో "శ్రీవత్సవాయ ప్రసిద్ధాన్వయ భూవరుల మన్ననఁ గుల గురుతు గాంచి" అని వ్రాసినారు. (బ్రహ్మశ్రీ) కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారి పెద్దాపుర సంస్థాన చరిత్ర విమర్శనము. ౧౦౮-౧౩౩;

# రామయ భాస్కరుడు

సీ॥ నిర్మించె నేమంత్రి నిరుపమ ప్రాకార
నవకంబుగా గోపినాధపురము
గెలిచినాఁ డేమంత్రి లలిత విక్రమమునఁ
బ్రబలుఁడై యవనుల బలము నెల్ల
నిలిపినాఁ డేమంత్రి నియత వైభవమున
గోపికావల్లభుఁ గూర్మి వెలయ
పాలించె నేమంత్రి ప్రకట ధర్మఖ్యాత
మహిమ మీఱఁగ నాంధ్రమండలంబు

గీ. అతఁడు భూపాల మంత్రీంద్ర సతత వినుత
ధీవిశారదుఁ డచ్యుత దేవరాయ
మాన్యహిత వర్తనుఁడు శౌర్యమహిత యశుఁడు
భాను తేజుండు రామయ భాస్కరుండు.

అని పద్యమొకటి కొండవీటి గోపీనాధస్వామి వారి యాలయ ముఖద్వార శాఖయందు చెక్కియున్నట్లు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిలవారు తమ చాటుపద్యమణిమంజరిలో నుదాహరించినారు.

క్రీ. శ. 1530 మొదలు 1542 వరకూ విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన అచ్యుత దేవరాయల వారి కాలములో బాచ మరుసయ్య అనే ఆయన రాయలవారి మంత్రియై కొండవీటి నేలినట్లు శా. శ. 1456కు సరియైన విజయ సంవత్సర కార్తిక బ ౧౧ గురు వారమునాడు చందలూరులో చెక్కించబడిన శాసనమువల్ల కనబడు తున్నది. (Butter worth, Vol II)

అచ్యుత దేవరాయలవారి యుద్యోగులైన రామభట్లయ్య, అడపం విశ్వనాధనాయకుడు, నలకరాజు సింగరాజు, ఇమ్మడి ఎల్లప్ప ఉపయరు, కృష్ణప్పనాయకులతో పాటు ఈ బాచమరసుగారు కూడా శా. శ. 1458కి సరియైన దుర్ముఖ నామ సంవత్సరంలో అనగా క్రీ. శ. 1537 సం॥ జనేవరి 12 వ తేదీన శ్రీతిరుపతి వేంకటేశ్వరస్వామి వారిని దర్శించి 15000 నార్పణములను సమర్పించినట్లు తిరుపతి దేవస్థానంలోని 440 సంఖ్యగల శాసనములో వ్రాయబడియున్నది.

రామయ భాస్కరునే బాచరసయ్య యనిన్నీ బాచమరుసు అనిన్నీ అనే వారనికూడా తిరుపతిలోని శాసనాలవల్ల తెలుస్తున్నది.

రామయ భాస్కరుడు కొండవీటికి ప్రభువుగా వచ్చిన తరువాత పూర్వం రెడ్డిరాజులు కట్టించిన కోట యొక్కరాళ్ళను ఊడదీయించి కొండవీటి కొండక్రింద ఒక కోటను దానికి ఒక ప్రాకారమున్నూ కట్టించి గోపీనాథ పురమనే ఒక గొప్ప పట్టణాన్ని కూడా నిర్మించి నాడు. అక్కడ గోపీనాథ స్వామివారి ఆలయాన్ని మళ్ళీకట్టించి అందులో గోపికావల్లభుని విగ్రహాన్ని ప్రతిష్ఠించినాడు. గోపీనాథ పుర ములో వెన్నముద్ద కృష్ణస్వామి, మూలస్థానేశ్వరుడు, అంగడి వీరభద్రుడు, మొదలైన దేవప్రతిష్ఠలు కూడా ఇతడు చేసినట్లున్నూ తెలుస్తున్నది. రామయ భాస్కరుడు బ్రాహ్మణుడైనా బాహుబలపరాక్రమము కలిగిన మహావీరుడై గోలకొండలోని తురకజులతో యుద్ధముచేసి గెలిచి రాజ్యమును సంరక్షించుకొని మంచి కార్యదీక్షతోను సమర్థత తోను దేశాన్ని పరిపాలించినాడు. ఆయన ప్రభుత్వమును గురించి 1916వ సం॥ మద్రాస్ ఎపిగ్రాఫికల్ రిపోర్టు 68వ పుటలో వ్రాయబడి యున్నది. *

రామయభాస్కరుని తండ్రిపేరు రామయ మంత్రిగారు; తల్లి పేరు తెలుగమ్మగారు; వీరిది ఉత్తరార్కాడు జిల్లా వందవాశి తాలూ కాలోచేరిన పాదిరికుప్పమనే గ్రామం. వీరు పరాశర గోత్రులు, ఆపస్తంభ సూత్రులు, యజుశ్శాఖీయులునైన ఆంధ్రనియోగి బ్రాహ్మ ణులు. వీరు నందవరీకులని కొన్ని గ్రంథములలో వ్రాయబడియున్నది. రామయభాస్కరుడు రామయమంత్రిగారి నాలుగవ కుమారుడు వీరి పెద్ద అన్నగారైన పెదతిమ్మయ లేక పెదతిమ్మరసయ్యగారికి రామ యామాత్యుడనే కుమారుడు కలిగి బయకార రామప్పయ్యగారని చరిత్ర ప్రసిద్ధుడై రామయ భాస్కరుని తరువాత కొండవీటికి పరిపాల కుడై 20 సంవత్సరములు ఏలినాడు.

రామయభాస్కరుడికి కృష్ణప్పయ్య యనే కొమారుడున్నాడు

* Tirupathi Devasthanam Epigraphical Report – By Sadhu Subrahmanya SastriGaru p. 235.

ఎవ్వరూ అనుకోనరు. ఈ దంపతులకు ఇద్దరు బిడ్డలుపుట్టి పోయిన తరువాత ఒక చక్కని కుమారుడు కలిగినాడు. జార్జి హారిస్ యొక్క యజమానుడు చాలా క్రూరుడు. వాడితని నొకకర్మాగారమునకు కూలీగా కవులుకిచ్చినాడు. ఈయువకుడా కర్మాగారములో నొక క్రొత్తయంత్రమును చేసి తన తెలివితేటలు కనుపఱచి పనిచేసినాడు. యంత్రము చేసినాడేగాని ఆ యంత్రమువల్లవచ్చే లాభమును వీడు పొందడానికి నోచుకోలేదు. ఆ యంత్రము హక్కులన్నీ యజమానివే. ఒకనాడాయజమానుడువచ్చి జార్జిపొందుతున్న గౌరవమునుచూచి ఓర్వలేక ఈ బానిస వెధవకింత గౌరవమేమిటి? అని ఆ కర్మాగారములోనుంచి తీసికొనిపోయి తన పొలములో పేడపిసికించడము మొదలైన నీచపు పనులు చేయిస్తూ చీటికీ మాటికీ వానిని కొట్టుతూ తన యాజమాన్యపు గర్వమును అధికారమును చలాయిస్తూ అతనిని హింసింపసాగినాడు. అంతటితో ఊరుకొనక "చక్కని పెండ్లామున్నది కదాయని నీకు పొగరెక్కినది; దానిని వదలి ఇంకొక దానిని పెండ్లాడతావా లేదా?'' అని నిర్బంధింపసాగినాడు. ఆ కాలములో బానిసలకు వివాహయోగ్యత లేదు. వారి పెండ్లిండ్లు మన్నించి గౌరవించేవారు లేరు. వారికి మానవస్వత్వములే లేవు. బానిసయనగా యజమానియొక్క చరాస్తి. ఆ వస్తువును చితుకగొట్టవచ్చును; ఛేదింప వచ్చును; విక్రయించవచ్చును; ఇచ్చవచ్చినట్లు చేయవచ్చును. అందువల్ల జార్జిని రక్షించేవారులేరు. జార్జి తన పెండ్లాముదగ్గర కన్నీరు మున్నీరుగా నేడ్చినాడు; "నేను జన్మింపక పోయినా బాగుండేది; అయ్యో ఇల్లాంటి బానిసత్వము ననుభవించుటకేనా యీ బాలకునిగూడా కన్నాము! పాపము దైవము మనల నేల సృజించాలి'' అని వేడి నిట్టూర్పునూర్చినాడు; "ఈ పిల్లిగాడెంత మంచివాడైతేనేమి? ఈ పాపపు బానిసత్వపద్ధతి ఎలాపోతుంది? వది ఎట్లు జరుగుతుందో ఎవ్వడెరుగును? ఈ యజమాని పరమపదించినా ఇంకొకవిధమైనా మీగతి ఏమిటి?'' అని వగచి 'లాభములేదు,నేను వారము రోజులలో కెనడా రాజ్యానికి పారిపోతాను. బ్రతికియుంటే మిమ్ములను కూడా విడిపిస్తాను' అని నిట్టూర్పు నూర్చి వెడలి పోయినాడు. ఆ రోజున తనభార్యకు బిడ్డకు కలగబోయే ఘోరవిపత్తును కలనైన ఊహించ లేకపోయినాడు.

షెల్బీగారు చాల మంచివాడేగాని ఋణములలో పడిపోయినాడు. అందువలన ఆయన దగ్గరనున్న మంచి బానిసలను కొనుక్కోవాలని హాలే అనే బానిసవర్తకుడు ఒకడు షెల్బీగారి ఋణపత్రములను చేజిక్కించుకొనివచ్చి టామును ఎలిజా కొమారుడైన హారీని తనకు విక్రయిస్తే ఋణవిముక్తి చేస్తాననీన్నీ లేకపోతే సర్వనాశనము చేస్తాననీన్నీ నిర్బంధింపసాగినాడు. షెల్బీకిది యిష్టము లేకపోయినా వారిని విక్రయించడానికి అంగీకరింపవలసి వచ్చినది. ఎలిజా కీసంగతి తెలిసి హారీని చంకనుపెట్టుకొని ఆరాత్రి ఆమంచులో పడి కాలినడకను పలాయనమై నడిచి నడిచి డస్సి, 'ఓహియో' మహానదిని ఆరాత్రి దాటడం దుర్లభమని తలచి ఆ నదీతీరమున నొక వంట పూటింట బసచేసింది. ఈ లోపుగా హాలే కొన్ని వేటకుక్కలను వెంట బెట్టుకొని తాను కొనిన బానిసను వెదకి వేటాడడానికి బయలుదేరినాడు. ఎలిజా యెలాగైనా తప్పించుకొనుగాకయని, షెల్బీగారిభార్య వేయి దేవుళ్లకు మొక్కుతున్నది. హాలే తుదకు ఆ వంటపూటింటికి పోగానే ఎలిజా పులినిచూచి భీతిల్లిన లేడిలాగ లేచి బాలుణ్ని చంక నెత్తుకొని ప్రాణములకు తెగించి ఓహియోనది పైన తేలుతూవున్న మంచుగడ్డల పైననే నడచిపోదలచి ఒకదానిపైనుండి ఇంకొక దానిపైకి దుముకుతూ నదిని దాటిపోయి ఆవలియొడ్డు చేరింది. ఆ కాలములో అవసరమైతే దొంగసాక్ష్యము లిచ్చి బానిసలను పట్టి యివ్వడమే పనిగా జీవించే వారు కొందరుండేవారు. ఎలిజాను పిల్లవానిని పట్టుకోడానికి అలాంటి దుర్మార్గులను నియమించి హాలే తిరిగి వచ్చి టామును వెంటబెట్టుకొని పోయినాడు. షెల్బీగారిభార్య టాముతో "మా చిక్కులు తీరిన తరువాత నిన్ను మళ్ళీ కొని తెస్తా"నని కన్నీటితో అన్నది. దారిలో హాలే ఇంకొక స్త్రీని బాలుణ్ని కొని స్టీమరెక్కినాడు, మార్గమధ్యమున అతడు ఆబాలునింకొకని కమ్మివేశాడు. ఆ దుఃఖము భరించలేక ఆ స్త్రీ నదిలోదూకి మరణించినది. కాని హాలే కిది ఒక వందరూపాయిల నోటు పోయినట్లుగా తోచినదేగాని నిండుప్రాణము పోయినట్లు తోచలేదు. టాము యొక్క అదృష్టవశమువల్ల లూసియానా జిల్లా కాపురస్థుడైన 'అగస్టైన్ సెంట్ క్లేర్' అనే ఒకధనాఢ్యు

గాని అతడంత ప్రసిద్ధివహించలేదు. వీరి వంశముయొక్క వివరములు వీరు తిరుపతిలో వేయించిన దానశాసనములవల్ల తెలుస్తున్నవి.

రామయభాస్కరునికి చిన్నమాంబగారనే చెల్లెలుండేది. ఆమె ప్రోలాపల్లనార్యుని భార్య. "ఆమె గోపీనాథ జలధి" యనే పెద్దచెఱువును త్రవ్వించినది. దానిని వంకాయులపాటి పెద్ద చెఱువని అంటారు. ఆమె యింకా చాలా దానధర్మాలనుచేసి కీర్తిగడించినది. కొండ వీటికి మూడుకోసుల దూరములో రామచంద్రపురమనే గ్రామ మొన్ని కట్టించి అందులో పరమేశ్వరుడనే పేరున శివప్రతిష్ఠ చేయించి సాతులూరనే అగ్రహారము నిచ్చినది. పైనచెప్పిన రామచంద్రపురమును వంకాయులపాడునుకూడా ఆమె బ్రాహ్మణుల కగ్రహారముగా నిచ్చినది. శా. శ. 1462 కు సరియైన శార్వరి సం॥ములో వంకాయుల పాటి పెద్దచెఱువు కట్టకింద వేయించిన శిలాశాసనములో ఆమె "రామయ మంత్రి బాచప్రధాన" వర్యుని సోదరిననిన్నీ, ప్రోలాపెల్ల ప్రభుని ధర్మపత్నిననిన్నీ సంస్కృత శ్లోకములందు వ్రాయించినది. దాని క్రింద నున్న తెలుగు పద్యములలో కూడా. తన సహోదరుడైన రామయ భాస్కరుణ్ణి ప్రశంసించియున్నది.

సీ. శ్రీమీరు కన్నడ క్షితివరాచ్యుతరాయ
సన్మంత్రి రత్నంబు జలజనాభు
పాదాబ్జ సేనాని భాసుర హృదయుండు
కొండవీటిని ధరామండ లేంద్రు
డైన రామయ భాస్కరామాత్యు సోదరి
యనఘు ప్రోలాప యెల్లార్యపత్ని
పార్వతీశ్వర దేవుభక్తిః బ్రతిష్ఠించి
గ్రామాది భోగముల్ గలుగజేయు

తే. చిన్నమాంబిక నిజకృత స్థిరతరాగ్ర
హారవంకాలపాటి శుభావరాఖ్య
రామచంద్ర పురాభ్యర్ణ సీమయందు
విప్రతత్పుల సంధాన విపుల మతిని.

సీ. కర్ణాట భూపాల ఘన కృపాకలిత వి
స్తీర్ణ గజాంత లక్ష్మీవరుండు
చండ ప్రతాపభాస్కరుఁడు భాసురదండ
నాథు సోదరి మహోన్నత గుణాఢ్య
పూని షోడశ మహాదాన విద్యా ప్రౌఢి
చిరకీర్తి గన్నట్టి చిన్నమాంబ
దుగ్ధాంబునిధితోడఁ దులదూగు గోపికా
నాథు సముద్రంబు నలువు మీఱి
తే. ధరణి కట్టించె నా చంద్రతారకముగ
నఖిల హితమైన యీ ధర్మ మాచరించె

... ... ... ...

శ్రీ శ్రీ శ్రీ మంగళం మహాశ్రీం జేయును.

కొం డ వీ డు ప్ర భు త్వ ము

సీ. పరరాజ్య పరదుర్గ పరవైభవ శ్రీలఁ
గొనకొని విడనాడు కొండవీడు
పరిపంథి రాజన్యబలముల బంధించు
కొమరు మించిన బోడు కొండవీడు
ముగురు రాజులకును మోహంబు పుట్టించు
గుఱుతైన యుతిశాద్రు కొండవీడు
చటులవిక్రమకళా సాహసంబొనరించు
కుటిలాత్ములకు గాడు కొండవీడు
గీ. జవనఘోటక సామంత సరసవీర
భటనటానేక హాటక ప్రకట గంధ
సింధురారవ మోహనశ్రీలఁ దనరు
కూర్మి నమరావతికి జోడు కొండవీడు.

అని కవిసార్వభౌముడు శ్రీనాథ మహాకవి వర్ణించిన కొండవీడు చరిత్రప్రసిద్ధమైన మహాపట్టణము. కాకతీయ ప్రతాపరుద్ర

* చూడు మద్దుల పల్లి గురుబ్రహ్మ శర్మగారి కొండవీటి సామ్రాజ్యము పుటలు 116-119.

చక్రవర్తి సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత పదమూడు పదునాల్గు శతాబ్దులలో ఆంధ్రదేశాన్ని పరిపాలించిన రెడ్డిరాజులకాలంలో కొండవీటి రాష్ట్రానికంతా ఇది ముఖ్యపట్టణముగా నుండేది. ఇది రమారమి నాలుగైదు చతురపు మైళ్ళ వైశాల్యముకలిగి ఏడువాడలనే పేటలు గల గొప్పబస్తీగా నుండేది. కొండవీటిలో దుర్భేద్యమైన ఒక గొప్పకోట ఉండేది. ఈ కోటకు ఇరువైమూడు బురుజులు ఉండేవి. ఈ పట్టణంలో అనేక దేవాలయాలు తటాకాలు ఉండేవి. వర్తక వ్యాపారాలు విరివిగా జరిగేవి. ఆకాలంనాటి కొండవీటి రాష్ట్రంలో ఇప్పటి కృష్ణా గోదావరి గుంటూరు నెల్లూరు జిల్లాలు కర్నూలు జిల్లా యున్నూ కూడా చేరియున్నట్లు శాసనాలవల్ల తెలుస్తున్నది. కొండవీటి దండకవిలెనుబట్టి ఈ రాజ్యంలో కొండవీడు వినుకొండ నాగార్జున కొండ బెల్లంకొండ అనే నాలుగు గిరిదుర్గాలున్నూ కొండవీటి సీమ వినుకొండ బెల్లంకొండ అద్దంకి ఉదయగిరి మొదలైన 14 సీములున్నూ 84 స్థలదుర్గాలనే కోటలున్నూ 2400 గ్రామాలున్నూ ఉన్నట్లున్నూ ఇది 22300 చదరపుమైళ్ళు విస్తీర్ణం కలిగిన రాజ్యమనిన్నీ తెలుస్తున్నది. దేశం మొత్తం మీద 72 పాళెగాండ్రనే నాయకులుండి దేశరక్షణను పరిపాలనను జరిగిస్తూ వుండేవారు.

కాకతీయ సామ్రాజ్యాన్ని పరిపాలించిన రెండవ ప్రతాప రుద్రుని తరువాత 1326 మొదలు 1424 వరకూ రెడ్డిరాజులు పరిపాలించారు. వీరిలో అనవేమారెడ్డి సుప్రసిద్ధుడు. 1424తరువాత దేశము కళింగరాజులైన గజపతుల వశమైనది. క్రీ. శ. 1509 మొదలు 1529 వరకూ విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన శ్రీకృష్ణదేవరాయుల వారు 1513–1515 సంవత్సరముల మధ్య పూర్వదిగ్విజయ యాత్రచేసి శా. శ 1437కు సరియైన యువ సంవత్సరములో ఉదయగిరి దుర్గమును సాధించి తిరుమల కాంతారాయ మహాపాత్రుని పట్టుకుని అద్దంకి వినుకొండ బెల్లముకొండ నాగార్జునకొండ తంగెడ కేతవరము మొదలైన గిరి దుర్గములను స్థలదుర్గములను ఏకదాడినిపట్టుకుని కొండవీటి దుర్గము మీద విడిసి ఒగ్గలు పట్టించి, దుర్గము పట్టుకుని వీరభద్ర గజపతి మొదలైనవారిని పట్టుకుని వారికి లోబడగా అభయమిచ్చి అమరేశ్వ

రానికి వచ్చి స్వామిని ఆరాధించి శ్రీశైలానికి వచ్చినట్లు శ్రీశైల మల్లికార్జున స్వామివారి ఆలయం గర్భగుడికి పూర్వముఖ మంటపము పైనగల దిన్నెమీది శాసనము చెపుతున్నది. (కొండవీటి సామ్రాజ్యము పుట 101) కృష్ణదేవరాయల వారు పూర్వ దిగ్విజయ యాత్ర చేసి వరావరుద్ర గజపతి రాజ్యంలో చేరియుండిన కొండవీడు, కొండపల్లె, బెల్లంకొండ, వినుకొండ, నాగార్జునకొండ సీమలను జయించి కొండవీడులో కొండయ్యను వినుకొండలో భాస్కరయ్యను బెల్లంకొండలో వీరభద్రయ్యను నాగార్జునకొండలో అయ్యలయ్యను తాళ్యం వుంచినట్లు పూర్వకాలము నాటి తెలుగు వచన గ్రంథమైన రాయవాచకము చెప్పుతున్నది.

వినుకొండను పరిపాలించడానికి నియమింపబడిన భాస్కరయ్య మన రామయ భాస్కరుడేనని సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులైన డాక్టర్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగారు నిర్ధారణ చేసియున్నారు.* కొండవీడు పరిపాలకుడుగా నియమింపబడిన కొండయ్య, రాయసం కొండయ్య యనిన్నీ బెల్లంకొండ పరిపాలకుడుగా నుంచబడిన వీరభద్రయ్య రాయలవారి మామగారైన కుమార వీరశ్యామ రాయలనిన్ని నాగార్జునకొండ పరిపాలకుడుగా నియమింపబడిన అయ్యలయ్య రాయసం అయ్యపరసు అనిన్ని తెలుస్తున్నది.

కృష్ణదేవరాయల వారు 1513-15 మధ్య కొండవీడును జయించగానే సాళువ తిమ్మరసు మహామంత్రి మేనల్లుడైన నాదిండ్ల గోప మంత్రిని పరిపాలకునిగా నియమించినారు. గోపమంత్రి శాసనమొకటి శా. శ. 1447 కు సరియైన క్రీ. శ. 1525-6 నాటిది కొండవీడులో పట్టాభిరామ దేవాలయంలో కనబడుతున్నది. కొండవీటి పోలేరమ్మ గుడిదగ్గరకూడా ఆయన శాసన మున్నది.

క్రీ. శ. 1530 లో నలకరాజు పెదతిరుమలయ్య దేవుడు ఒక తటాకమును ఉద్యానవనమును నిర్మించి కొండవీడులోని వేటపాలెంలో గోపీనాథస్వామి దేవాలయానికి దానము చేసినట్లు వెలమలూరు పాడు

* Sources of Vijayanagar History by Dr. S. Krishna Swami Iyengar p. 114.

లోని శాసనము చెప్పుతున్నది. అప్పు డతడు కొండవీటికి పరిపాల కుడై యుంటాడు.

క్రీ. శ. 1531 లో రాయసం అయ్యపరుసు కొండవీటికి పరిపాలకుడై, బహుశా 1533 వరకూ పరిపాలించినాడు. అటుతరువాత అచ్యుతదేవరాయలవారు 'బాచరస' అనే రామయ భాస్కరుణ్ణి కొండవీటికి పరిపాలకుడుగా నియమించగా అతడు క్రీ. శ. 1539 వరకూ పరిపాలించినాడు. ఆయన తరువాత ఆయన అన్నగారి కుమారుడైన రామయామాత్యుడు కొండవీటిని ఇరవై సంవత్సరములు పరిపాలించాడు.

## కత్తుల బావి కథ

శ్రీకృష్ణ దేవరాయలవారు పూర్వ దిగ్విజయ యాత్రచేసి తమ బాహుబల పరాక్రమమువల్ల కొండవీటి సీమను స్వాధీన పరచుకొన్నట్లు చరిత్రాధారాలు కనపడుతూ వుండాగా ఈ కొండవీటి రాష్ట్రాన్ని పరిపాలించిన రెడ్డిరాజుల సామంతులుగా నుండిన 72మంది పాలెగాండ్రు చాలా బలవంతులుగా నున్నందువల్ల వారిని యుద్ధంలో జయించడం కష్టసాధ్యమని రాయలవారు ఆలోచిస్తు వుండినట్లున్నూ అంతట వారి కొలువులో నుండిన రామయ భాస్కరుడు మాయోపాయంచేత ఈ పాలెగాండ్లను వధించినట్లున్నూ అంతట రాయలవారీ సీమనుసులభంగా స్వాధీన పరచుకొన గల్గినారనిన్నీ ఒక కథ చిరకాలంనుంచి ప్రచారంలో నున్నది.

కొండవీటికి దిగువనున్న గోపీనాథస్వామివారి ఆలయాన్ని పునరుద్ధరించే మిష తో రామయభాస్కరుడు రాయలవారి దగ్గర నుంచి కావలసినంత ధనమును పరివారమును తీసుకొని పోయి ఆలయం కట్టించడంలో గర్భగుడి ముందర అగాధమైన ఒక బావి తీయించి దానిలో వాడియైన కత్తులను అమర్పించి గుడిలోపలికి వచ్చేవారు ద్వారము దాటి లోపల అడుగుపెట్టగానే ఆ నూతిలో పడేటట్లుగా కీలుతో నొక బండరాతిని అమర్పించి నాడనిన్నీ, స్వామి వారికి బ్రహ్మోత్సవము

* (చూడు: డాక్టర్ నేలటూరి వెంకట రమణయ్యగారి మూడవ విజయనగర రాజవంశ చరిత్ర. పుటలు 18-19)

జరిగించే ఏర్పాటులుచేసి దానికి పాలెగాండ్ల నందరినీ ఆహ్వానించి నాడనిన్ని స్వామిదర్శనానికని ఆపాలెగాండ్రొక్కొక్క రొకరినేలోపలికి పిలిచి ఆబావిలో త్రోయించి చంపించి నాడనిన్నీ. ఇలాగ శత్రు సంహారం చేసిన తరువాత రాయలవారు తమ సైనిక బలాలతో వచ్చి కొండవీటిని సులభంగా స్వాధీనపరచు కొన్నారనిన్నీ ఈ కథయొక్క సారాంశము.

ఎన్నో మహాయుద్ధములుచేసి జయించిన కృష్ణదేవరాయల వారీ పాలెగాండ్రను జయించలేక ఈ మాయోపాయంనల్ల వారిని వధింప జేసి కొండవీటి నాక్రమించి నారసిగాని శత్రుభయంకరుడని మహా వీరుడని పేరుపొందిన రామయ భాస్కరు డిలాంటి ఘోరపాతకమును అందులో ఒక దేవాలయంలో జరిగించి యుంటాడనిగాని నమ్మ డానికి ఎంతమాత్రము వీలు లేదు. అలాంటి కత్తులబావి యున్నట్టి చిహ్నము లేవీ ఆయాలయంలో కనబడడము లేదు.

గోపీనాథస్వామి యాలయ నిర్మాణమున్నూ ఇతర దేవ ప్రతిష్ఠ లున్నూ రామయ భాస్కరుడు కృష్ణదేవరాయల వారి తదనంతరం అచ్యుత దేవరాయలవారి కాలంలో కొండవీటికి పరిపాలకుడుగా నున్నప్పుడు జరిగించినవి గాని అంతకు పూర్వం జరిగించినవి కావని శాసనముల వల్ల తెలుస్తున్నది. అందువల్ల రామయ భాస్కరు డంటే గిట్టని వారెవ్వరో తరువాత ఈ పుక్కిటి పురాణమును కల్పించి యుంటారనడానికి సందేహము లేదు.

అచ్యుత దేవరాయలవారి పరిపాలన కాలంలో చివర ఆరు సంవత్సరములలోను రాయలవారు అంతఃపురము వదలక భోగలాలసులై రాజ కార్యాలయములను నిర్వహించడం ఉపేక్షించారు. ధన వ్యయం అధికమైనది. సొమ్ముకోసం సామంతులను పీడించేవారు. చక్రవర్తిగారి ప్రభుత్వము బలహీనమైనందువల్ల సామ్రాజ్యంలోని సామంత మండలేశ్వరులు అమరనాయకులు పాలెగాండ్రు బలవంతులై నిరంకుశులై దుష్టపరిపాలనము చేస్తూ ప్రజాపీడనము చేయ సాగించారు. కొందరు తిరుగుబాటునే చేసినారు. అంతట కృష్ణ దేవరాయలవారి అల్లుడైన అళియ రామరాయ లని ప్రఖ్యాతి జెందిన

ఆరవీటి రామరాజుగారు ప్రభుత్వభారం వహించి, ఈ అరాజకాన్ని అణచినారని ఒకకైఫీయతులో చెప్పబడియున్నది. (Local Records No. 6 p. 40) ఆకాలమునాటి శాసనములవల్ల కూడా అప్పటి అరాజక స్థితి, తెలుస్తున్నది. (మూడవ విజయనగర వంశచరిత్ర పుట 242–3)

ఆకాలంలో కొండవీటికి పరిపాలకుడుగా నుండిన రామయ భాస్కరుడు కూడా చాలా నిరంకుశుడై అతి కఠినముగా పన్నులు వసూలుచేసి ప్రజాపీడనము చేసినట్లున్నూ బ్రాహ్మణులను కూడా బాధించినట్లున్నూ పలకలూరి సోమన విరచితమైనట్లు ప్రతీతిగల ఒక చాటుపద్యము వల్ల తెలుస్తున్నది

ఆ. వె. గోలకొండ మలక గోవుల భక్షించు
కొండవీటి విప్రకులము నెల్ల
బాచమరసుచేరి భక్షించుచున్నాడు
మలక మేలో బాచ మరసు మేలొ

ఈ ఈపద్యము అప్పకవీయములో నుదాహరింప బడియున్నది. ఇందులో మలక యనే మాటకు తురక అనే పాఠాంతరము కూడా కనబడుతున్నది. మలక యనగా కొండవీటిని పరిపాలించిన కుతుబ్ శాహియనే సుల్తాను.

రామయ భాస్కరుణ్ని తురకతో పోల్చి చెప్పినందువల్ల ఆయన అప్పట్లో యెంత జనకంటకుడుగా నుండినాడో ఊహించుకోవచ్చును.

---

# "బయఃకార రామప్పయ్య" గారు

ప్రస్తుతము చెన్నపురి రాజధానిలో చేరియున్న తెలుగు కన్నడ అరవ మలయాళ ప్రాంతాలున్నూ, మైసూరు తిరువాంకూరు కొచ్చిను మొదలైన సంస్థానాలున్నూ ఇంగ్లీషు ప్రభుత్వానికి పూర్వం రమారమి మూడువందల సంవత్సరాలు విజయనగర చక్రవర్తుల పరిపాలనకింద నుండేవి. కటకం మొదలు కన్యాకుమారిదాకాను తూర్పు పడమర సముద్రముల మధ్యనుగల ఈ విశాల సామ్రాజ్యానికి రాజధాని తుంగభద్రానదీ తీరానగల విజయనగరము. సామ్రాజ్యంలోని వివిధప్రాంతాలను చక్రవర్తికి సామంతులైన రాజులు, మండలేశ్వరులు, నాయకులు, దొరలు, మన్నీలు మొదలైన ప్రభువులు పరిపాలించేవారు. సాధారణముగా ఒక్కొక్క దుర్గమునకు అధిపతిగానుండే సేనానాయకుడు ఆ దుర్గానికి చుట్టుపట్లనున్న ప్రాంతాలన్నింటికీ పరిపాలకుడుగా నుండేవాడు. ఇలాగ కొండవీడు, ఉదయగిరి, గుత్తి, పెనుగొండ, చంద్రగిరి, చంద్రగుత్తి, రాయదుర్గము, నిడగల్లు, రాయచూరు, పాలాయివీడు దుర్గాధిపతులు ఆ యా సీమలను పరిపాలిస్తూ ఉండేవారు. ఈ ప్రభువుల నొక ప్రాంతమునుండి ఇంకొక ప్రాంతానికి మార్చడంకూడా జరుగుతూ ఉండేది.

క్రీ. శ. 1530 మొదలు 1542 వరకూ విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన అచ్యుత దేవరాయలవారి కాలంలో 1539 వరకూ పదేళ్ళపాటు బాచమరసు అనే వాడుక పేరుగల రామయభాస్కరుడు చక్రవర్తిగారి రాజ ప్రతినిధిగా కొండవీటి సీమను పరిపాలించినాడు. ఆయన తరువాత ఆయన అన్నకుమారుడైన రామయామాత్యుడు కొండవీటికి పరిపాలకుడైనాడు. అతడు మొదట చిన్న చిన్న ఉద్యోగములుచేసి తరువాత రాజప్రతినిధియైనాడు.

ఆయన కొండవీటికి రాజ ప్రతినిధిగా నున్న కాలములోనే కన్నడ ప్రాంతాలకు కూడా రాజప్రతినిధిగా పంపబడినాడు. ఆయనను 'బయకార రామప్పయ్య'గారని అనేవారు. అచ్యుత దేవరాయల వారి తరువాత క్రీ. శ. 1542 మొదలు 1569

వరకూ విజయనగరచక్రవర్తిగా నుండిన సదాశివరాయల వారి కాలములో వారినొక కీలుబొమ్మగా ఆడిస్తూ దేశాన్ని సాక్షాత్తుగా పరిపాలించిన ప్రభువు కృష్ణదేవరాయల అల్లుడు అళియరామ రాయలనే ఆరవీటి రామరాజుగారు. ఆయనకూడా రామయామాత్యుణ్ని కొండవీటికి రాజప్రతినిధిగా నియమించినట్లు 1915 వ సంవత్సరపు మద్రాసు ఎపిగ్రాఫికల్ రిపోర్టు 51 వ పేరాలో నుదహరింపబడిన శాసన దృష్టాంతరమువలన తెలుస్తున్నది.

ఈ రామయామాత్యుడు అనేక దానధర్మాలను చేసినట్లున్నూ దేవాలయాలను తటాకాలను నిర్మించినట్లున్నూ ఆంధ్రదేశంలో అనేక బ్రాహ్మణాగ్రహారాలను నిర్మించినట్లున్నూ కూడా పై యాధారము చెపుతున్నది.

రామయామాత్యుడు గొప్ప రాజ్యతంత్రజ్ఞుడు. సమర్థుడైన పరిపాలకుడు మాత్రమేగాక గొప్ప విద్వాంసుడు. సంగీత సాహిత్యముల యందు విశారదుడు. ఆయన సంస్కృతములో స్వరమేల కలానిధి యనే సంగీతశాస్త్ర గ్రంథాన్నిరచించి అళియరామ రాయల కంకిత మిచ్చినాడు. అందులో తనను "పూర్వాధిక కొండవీటి ప్రధాన దుర్గ ప్రతిపాదనేన జేలూరిసింహాసన పట్టణేనయుక్తాం" అని చెప్పుకొన్నాడు. గద్యలో "ఇతి శ్రీమదభినవభరతాచార్య వాగ్గేయకార తోడరమల్లాతిమ్మామాత్య నన్దన రామామాత్య నిర్మితే స్వరమేల కలానిధౌ" అనిన్ని వ్రాసికొన్నాడు.

'తోడరమల్ల' అనేది ఒక బిరుదేకానీ పేరుకాదు. రామయామాత్యుని మాతామహుడైన కల్లినాథుని కీ బిరుదుండేది. ఆయన కూడా సంగీత సాహిత్యముల యందు గొప్పవిద్వాంసుడు; శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమనే సంగీత గ్రంథానికి వ్యాఖ్యానమును రచియించిన వాడు. క్రీ. శ. 1447-65 మధ్య విజయనగర చక్రవర్తిగా నుండిన మల్లికార్జున రాయలవారికిని 1465-78 మధ్య చక్రవర్తిగానున్న విరూపాక్ష రాయలవారికిని ఆప్తుడుగానుండి 'చతురకల్లినాథ తోడరుమల్ల' అని ప్రఖ్యాతి జెందినాడు. రామయామాత్యుడు తన స్వరమేల కలానిధిలో తన పేరును 'రామయామాత్యా తోడరమల్ల'యని వ్రాసికొన్నాడు.

రామయామాత్యుడు గొప్ప గాయకుడు. అచ్యుత దేవరాయలవారి వద్దను అళియ రామరాయల దగ్గరను తన సంగీత విద్యను ప్రదర్శించి మెప్పు పొందినాడు. అచ్యుత దేవరాయల అంతఃపురస్త్రీలకును అళియ రామరాయల కొమార్తెలకును సంగీతముచెప్పిన విద్యాగురువు. అందువల్లనే ఆయనకు 'బయకార' రామప్పయ్యగారని పేరువచ్చినది. బయకారు అనగా సంగీత విద్వాంసుడు. రామప్పయ్యగారి స్వరమేల కలానిధి గొప్ప శాస్త్ర గ్రంథము. దక్షిణ హిందూదేశములోని కర్నాటక సంగీతవిద్యాభివృద్ధికి గ్రంథము చాలా ఉపకరించినదని విద్వాంసులు అభిప్రాయ పడుచున్నారు. రామప్పయ్యగారు, ఈ గ్రంథమును తన ప్రభువైన అళియ రామరాయలకే అంకితమిచ్చి అందులో కృతిపతి వంశావళినీ అతని సాహసౌదార్యములను వర్ణించియున్నాడు.

రామప్పయ్యగారు గొప్ప విద్వాంసుడే గాక గొప్ప శిల్పి. తన శిల్ప కళా నైపుణ్యమును వినియోగించి అళియ రామరాయల కొసము చిత్రకూటమనే దివ్యభవనము నొక దానిని నిర్మించినట్లు స్వరమేల కలానిధిలోనే చెప్పియున్నాడు. అది సుందరమైన ఉద్యానవనములో అనేక చిత్రశిల్పములతో నిర్మింపబడి వైజయంతమనే దివ్యభవనాన్ని మించినదని తానే వ్రాసియున్నాడు.

(Sources of Vijayanagar History — Dr. S. Krishna Swami Ayyangar p. 190.)

బయకార రామప్పయ్యగారు, రామయామాత్యుడు, అని వ్యవహరింపబడే రామయమంత్రిగారు ఉత్తరార్కాడుజిల్లా వందవాశి తాలూకా పాదిరికుప్పం కాపురస్థుడున్నూ పరాశర గోత్రుడున్నూ ఆపస్తంభ సూత్రుడు యజుశ్శాఖీయుడున్నూ అయిన పెరియతిమ్మరసయ్యగారినే పెదతిమ్మయగారి కొమారుడు. వీరు ఆంధ్రనియోగి బ్రాహ్మణులు * నందవరీకులని కొందరంటున్నారు. ఈ తిమ్మరసయ్యగారు రాయలవారిదగ్గర రాయసం అనే మంత్రిపని చేసినందువల్ల ఆయనను రాయసం పెదతిమ్మరసయ్య అని అనేవారు. (మా. నె254రు

* చూడు : తిరునల్వేలి జిల్లాలోని ఎట్టియాపుర సంస్థానము వారిచే ప్రకటింపబడి శ్రీ సుబ్బరామ దీక్షితులవారిచే రచియింపబడిన సంగీత సంప్రదాయ ప్రదర్శినిలోని వాగ్గేయ కారుల జీవితములు. (1904)

గోవిందరాజస్వామిగుడి శాసనము) అరవప్రాంతాలలో ఆయనను పెరియ తిమ్మరసయ్యా అనిన్నీ తెలుగువారు పెదతిమ్మరసయ్యగా రనిన్నీ అనేవారు. రామయామాత్యుని తల్లి పేరు పెదలక్కలీశమ్మ గారు. వీరి వంశావళి *1919* వ సంవత్సరపు మద్రాసు ఎపిగ్రాఫికల్ రిపోర్టు 105 వ పుటలో వివరింపబడినది.

రామమంత్రి తెలుగమ్మను పెండ్లియాడగా ఆవిడవల్ల ఆయనకు పెదతిమ్మయ, తిమ్మమంత్రి, నూరయ, భాస్కరుడు లేక రామయ భాస్కరుడు, భావయ, అనే ఐదుగురు మొగపిల్లలున్నూ చిన్నమాంబ యనే కొమార్తెయున్నూ కలిగినారు. చిన్నమాంబను ప్రతాప ఎల్లనార్యునికిచ్చి వివాహము చేసినారు. పెదతిమ్మయ గారినే తిమ్మరసయ్య అనేవారు. ఆయనే రామప్పయ్యగారి తండ్రియైన తిమ్మరసయ్యగారు. ఆయన తిరుపతిలో గోవిందరాజస్వామివారికి నిత్యారాధన నిమిత్తం కొండవీటి సీమలోని చీరాల పేరాల అందుపల్లి గ్రామములున్నూ మనుమప్రోలు సీమలోని కొప్పోలి గ్రామమున్నూ శా. శ 1460 విళంబి సంవత్సరమునకు సరియైన క్రీ. శ. 1539 వ సంవత్సరము సెప్టెంబరు 18 వ తేదీన దానము చేసినట్లు శ్రీతిరుపతి వెంకటేశ్వరస్వామి వారి నె 254 రు శాసనములో నుదాహరింపబడినది. మొదటి మూడు గ్రామములమీదను సాలుకు 150 రేఖావణములున్నూ నాలుగవ గ్రామముపైన 350 రేఖావణములున్నూ వచ్చేవి. (అవి బంగారు నాణెములు). తరువాత కొంతకాలానికి రామప్పయ్యగారు తమ తండ్రిగారు లోగడ శ్రీ గోవిందరాజ స్వామివారికిచ్చిన దాన శాసనమును పురస్కరించుకొని కొన్ని మార్పులు చేస్తూ శా. శ. 1466 క్రోధినామ సంవత్సరమునకు సరియైన క్రీ. శ. 1544 సంవత్సరము జూను 16 వ తేదీన కొండవీడు రాజ్యంలో అద్దంకి సీమలో చేరిన నర్యూరు గ్రామమున్నూ బెల్లముకొండ సీమలోని కుప్పాయని కొండయున్నూ ఇంకొక సీమలోని కార్చూరు గ్రామమున్నూకూడా గోవిందరాజ స్వామివారికి సమర్పించారు. (చూ. గోవిందరాజ స్వామి దేవాలయంలోని నె352 రు శాసనము.)

గోవిందరాజ స్వామివారికి లోగడ తనతండ్రి తిమ్మరసయ్యగారు

దానమిచ్చిన కాపోప్పలు గ్రామంయొక్క దానపట్టాను రామప్పయ్య గారు ఖాయపరచి, చీరాల పేరాల అందుపల్లి గ్రామాలకు బదులుగా వాటిమీద వచ్చే 150 రేఖాపణాలకు సరిపోయేలాగున నెమ రాష్ట్రంలో ఇచ్చింపాడికి తూర్పుననున్న కుళత్తూరు గ్రామంలో ఒక అగ్రహారాన్ని ఏర్పాటుచేసి సగంగ్రామాన్ని ఇచ్చారు. ఈ గ్రామాల మీద ఆ దేవాలయానికి సాలుకు 950 రేఖాపణములు ఆదాయం వస్తుందని అంచనా వేశారు. ఆ సొమ్ములోనుండి గోవిందరాజ స్వామివారికిన్నీ ఇతర మూర్తులకున్నూ రామప్పయ్యగారు తన పినతండ్రి బాచరసయ్యగారి కొమారుడు క్రిష్ణప్పయ్యగారి పుణ్యము నిమిత్తము వినియోగించేటట్లు నిర్ణయించారు. స్వామివారి ప్రసాదములో తనకువచ్చే భాగాన్ని బాచరసయ్యగారి పుణ్యము నిమిత్తము వశిష్ఠగోత్రుడైన ఉదయగిరి దేవరాయభట్టరుగారి కుమారుడు శ్రీనివాస భట్టరుకు రామప్పయ్యగారు ధారపోశారు ఈ శ్రీనివాసభట్టరుగారు కాళిదాసు శాకుంతల నాటకానికివ్యాఖ్యానమును రచియించిన ప్రఖ్యాతపురుషుడు. అప్పుడతడు తిరుపతిలో శ్రీరామ దేవాలయానికి పూజారిగా ఉండేవాడు. బాచరసయ్యగారి యొక్కయు ఆయన భార్య అమ్మాజమ్మగారి యొక్కయు తన సోదరుడైన క్రిష్ణప్ప యొక్కయు పుణ్యము నిమిత్తము రామప్పయ్యగారు శా. శ. 1461 సం॥ వికారికి సరియైన క్రీ. శ. 1539 ఆగష్టు 25 వ తేదీన బాచేశ్వర అమ్మేశ్వర కృష్ణేశ్వర దేవాలయములను నిర్మించినట్లు 1918 సం॥ ని 306 రు శాసనము చెపుతున్నది.

రామప్పయ్యగారి దాన శాసనములలో పేర్కొనబడిన బాచరసయ్యగారు 1919 సం॥ మద్రాసు ఎపిగ్రఫికల్ రిపోర్టు 105 పుటలో పేర్కొనబడిన రామయభాస్కరుడే. ఆ రిపోర్టులో భాస్కరుడని భావయ్యయని ఇద్దరిపేర్లుగా వ్రాయబడిన రెండుపేర్లున్నూ రామయ భాస్కరునివే యని విడివిడిగా వారు చేసినట్లు చెప్పే దానములను గూర్చిన శాసనాలవల్ల కనబడుతున్నది. (1915 సం॥ మద్రాసు ఎపిగ్రాఫికల్ రిపోర్టు పేరా 61; 1916 సంవత్సరం మద్రాసు ఎపిగ్రాఫికల్ రిపోర్టు పేరా 67; 1915 సం॥ 422 శాసనము). పైన చెప్పిన వంశావళిలో

పెదతిమ్మయగారి కుమారుడనిన్ని బయకార రామప్పయ్యగారి తమ్ముడనిన్ని పేర్కొనబడిన క్రిష్ణప్పయ్య రామప్పయ్యగారి స్వంత తమ్ముడు కాడనిన్ని, రామభాస్కరుని కుమారుడేననిన్ని తిరుపతి వెంకటేశ్వరుడి గుడి న 325 రు శాసనములవల్ల తెలుస్తున్నది.

శాలివాహన శకము 1456 జయ సంవత్సరమునకు సరియైన క్రి. శ. 1534 వ సంవత్సరము జూలై 20 వ తేదీన అచ్యుత దేవ రాయలవారి కుమారుడైన చిక్క (కుమార) వెంకటాద్రి రాయల వారి పుణ్యాం నిమిత్తం పరాశర గోత్రుడున్నూ పాదిరి కుప్పం కాపురస్థుడున్నూ శ్రీరామయ్యగారి కుమారుడున్నూ అయిన బాచ రసయ్యగారు శ్రీ వెంకటేశ్వరస్వామివారికి అనుదినము అరు తిరుప్పో నగములను (అన్నము నైవేద్యములను) ఏర్పాటుచేస్తూ, చేసిన దాన శాస నంలో అంతకుపూర్వము ఆయన అన్నకుమారుడైన రామప్పయ్యగారు స్వామివారికి నిత్య తిరుప్పోనగమును ఏర్పాటుచేసియున్న సంగతి యుదాహరింపబడినది. (తిరుపతి వెంకటేశ్వరస్వామి దేవాలయములోని న439 రుశాసనము) అందువల్ల క్రి. శ. 1534 నాటికే రామప్పయ్యగారు రాయలవారి కొలువులో ఏదోఒక ఉద్యోగిగా వున్నట్లు అనుకోవడానికి సావకాశం వున్నది.

ఆ సంవత్సరము చివర అనగా క్రి. శ. 1535 ఫిబ్రవరి 7 వ తేదిన రామప్పయ్యగారు మైసూరు దేశంలో హడినాడుసీమకు అధి కారిగా నున్నట్లు కనబడుతున్నది. ఆయన కార్యకర్త పాతమోాడ హళ్లిలో మల్లికార్జునస్వామివారి తాలూకు గ్రామాలను భూములను ఆ దేవాలయానికి కిప్పించినట్లు 1913 వ సంవత్సరపు 245 వ శాసనము చెపుతున్నది. క్రి. శ. 1539 ఆగష్టు నెలచివరకు సరియైన శా. శ. 1461 వికారినామ సంవత్సరమునాటి ఎనిమిది శాసనములలో రామ ప్పయ్యగారు బళ్లారిజిల్లాలోని కొన్ని గ్రామాలలో కొన్ని దేవాలయము లు తటాకములు నిర్మించి గ్రామములు నిర్మించినట్లు చెప్పబడియున్నది. (1918 సం॥ న 300-307 రు శాసనము). తిరుపతి వెంకటేశ్వరస్వామి వారి కతడిచ్చిన రెండవదాన శాసనము శా. శ. 1466 క్రోధికి సరి యైన క్రి. శ. 1544 సం॥ జూను 16 వ తేదినాటి గోవిందరాజస్వామి

గుడిలోని నె 352 రు శాసనము. తరువాత ఆ సంవత్సరాంతములో మళ్ళీ ఆయన చేసిన దానధర్మాలు బళ్ళారిజిల్లాలోనే కనబడుతున్నవి. అవి క్రీ. శ. 1545 జనేవరి 27 వ తేదినాటివి. (చూ. 1914 సంవత్సరం 514, 517 శాసనములు) ఆయన చేసిన దాన శాసనాలలో చివరిది శా. శ 1478 నల సంవత్సరమునకు సరియైన క్రీ. శ. 1556 సం॥ ఏప్రిలు 12 వ తేదినాటిది. (1925 సం॥ నె 304 రు శాసనము)

ఇలాగ రామప్పయ్యగారి శాసనములు వివిధ ప్రాంతాలలో కనబడుతున్నందునను అందులో సూచింప బడిన విషయములవల్లను ఆయన మొదట రాయలవారి కొలువులో చిన్నయుద్యోగాలు చేసిన తరువాత తనశక్తి సామర్థ్యాలవల్ల క్రీ. శ. 1539 లో కొండవీటికి రాజప్రతినిధిగా నియమింప బడినట్లు ఊహించవచ్చును.

1919 సం॥ మద్రాస్ ఎపిగ్రాఫికల్ రిపోర్టు 105 పుటలో రామ మంత్రికి కొమార్తె అనిన్ని పెదతిమ్మయకును రామయ భాస్కరునికిని సోదరిఅనిన్ని పేర్కొనబడిన చిన్నమాంబగారు రామప్పయ్యగారి మేనత్త. ఆవిడ ఆత్రేయసగోత్రుడున్నూ ఆశ్వలాయన సూత్రుడున్నూ ఋక్శాఖీయుడున్నూ అయిన ప్రతాప ఎల్లమరసుభార్య యనిన్ని సాలుకు 359 రేఖాపణములు ఆదాయంవచ్చే కొండవీడు సీమలోని రామచంద్రపురమనే గ్రామాంతరము గల వంకాయలపాడు గ్రామాన్ని శా. శ 1469 ప్లవంగ సంవత్సరమునకు సరియైన క్రీ.శ 1547 జూలై 8 వ తేదిన దానమిచ్చినట్లున్నూ తిరుపతి గోవిందరాజస్వామి వారి నె 401 రు శాసనములో కనబడుతున్నది. ఈ చిన్నమాంబగారు శా. శ 1462 శార్వరి సం॥ చైత్రమాసానికి సరియైన క్రీ. శ. 1540 మార్చి 22 వ తేదిన చంద్రగ్రహణ పుణ్యకాలమున ఈ వంకాయల పాడు గ్రామాన్ని అగ్రహారంగాచేసి దానికి రామచంద్రపురమని పేరు పెట్టినది. అదిగాక ఆవిడ యింకా ఇతర దాన ధర్మాలు చేసినది. నంతలూరులో పర్వతనాథస్వామిని ప్రతిష్ఠించినది. వంకాయలపాడు దగ్గిర గోపీనాథ సముద్రమనే తటాకాన్ని తవ్వించింది. (చూడు. మద్రాస్ ఎపిగ్రాఫికల్ కలెక్షనులోని 1915 సం॥ నె 422 శాసనము)*

* Tirupathi Devasthanam Epigrphical Report by Sri Sadhu Subrahmanya Sastri garu B. A. pp. 234—237.)

# వేంకటపతి దేవరాయ మహారాయలు

క్రీ.శ. 1585 మొదలు 1614 వరకూ కొంతకాలం పెనుగొండను, తరువాత చంద్రగిరిని రాజధానిగా చేసుకుని కృష్ణానదికి దక్షిణాన కావేరివరకూ గల దక్షిణహిందూదేశాన్నంతా ఏకచ్ఛత్రంగా పరిపాలించిన వెంకటపతి దేవరాయ మహారాయలు, ఆంధ్రభోజుడని ప్రసిద్ధి జెందిన విద్యానగర చక్రవర్తియైన కృష్ణదేవరాయుల అల్లుడైన ఆరవీటి రామరాజుగారి తమ్ముని కుమారుడు. భుజబల పరాక్రమంలోను సాహసౌదార్యాది సుగుణ సంపత్తిలోను రసజ్ఞతలోను కృష్ణదేవరాయుల తరువాత ఇతడంతవాడేనని ప్రఖ్యాతిని పొందినాడు. ఈయనకూడా సంగీతసాహిత్యాలను చిత్రకళలను పోషించాడు. ఆంధ్రకవులను ఆదరించి అనేక గ్రంథాలను వ్రాయించినాడు.

మహారాయలవారు పోర్చుగీసు పాదరీలకు దర్శన మివ్వడం.

వెంకటపతి దేవరాయల కాలంలో చెన్నపట్నం దగ్గర శాంతోములోను పులికాటు అనే ప్రళయకావేరిదగ్గరను వర్తకస్థానాల నేర్పరచుకుని వున్న పోర్చుగీసువారు సముద్రంపై నుంచి దేశంలోకి దిగుమతిచేసే సరుకులమీద నూటికి ఒక రూపాయిలో నాలుగవవంతు చొప్పున ఈ చక్రవర్తికి సుంకం చెల్లించేవారు. ఇంతేగాక చక్రవర్తిగారి సామంతులున్నూ ఆప్రాంతాలకు అధికారిన్నీ అయిన తంజావూరు ఆంధ్రనాయకుడికి కప్పంకూడా చెల్లించేవారు. డచ్చి ఇంగ్లీషు వర్తకులుకూడా ఆ కాలంలో మన దేశానికి వర్తకం చెయ్యడానికి వచ్చి ఈ విజయనగర చక్రవర్తిగారి సామంతుల నాశ్రయించి వ్యాపారం సాగించారు.

అప్పట్లో మన దేశంలో పశ్చిమ తీరాన్ని పోర్చుగీసుజాతి క్రైస్తవమత ప్రచారకులు కొన్ని క్రైస్తవమతాలను దేవాలయములను స్థాపించుకుని మతప్రచారముచేస్తూ ఈ విజయనగర రాజ్యంలోకూడా కొన్నిచోట్ల దేవాలయాలు కట్టుకోవాలని ఆలోచించారు. ఆప్రకారం చక్రవర్తిగారిని దర్శించి చంద్రగిరిలో ఒక క్రైస్తవమతాన్ని స్థాపించుకోవడానికి అనుజ్ఞను పొందాలని నిశ్చయించారు.

అప్పట్లో రాయలవారి మామగారైన ఓబరాయలు కాంచీపురానికి పరిపాలకుడుగా వున్నందువల్ల ఆయనద్వారా ప్రయత్నిస్తే

ఇది సాధ్యమవుతుందని ఆలోచించి మెల్లిగా ఆయనను ఆశ్రయించారు. ఆయన చక్రవర్తిగారి దర్శనం చేయిస్తామని సెలవిచ్చారు. అంతట మహారాయలవారి దర్శనం నిమిత్తం శాంతోము రెక్టారైన ఫాదర్ డీసా గారున్నూ ఫాదర్ ఫ్రాన్సిస్కోరిచిరో గారున్నూ కలిసి 1598 వ సం॥ అక్టోబరు 10 వ తేదీన చంద్రగిరికి బయలు దేరారు. అక్కడ ముందుగా ఓబరాయలుగారిని దర్శించి వారికి కొన్ని బహుమతులు సమర్పించగా ఆయన సంతోషించి తన మండలంలో నెక్కడనైనా సరే క్రైస్తవ దేవాలయం కట్టుకోవచ్చునని సెలవిచ్చి వీరిని సత్కరించి తరువాత కొద్దిరోజులకు మహారాయల వారి దర్శనం చేయించారు.

వీరు వెంకటపతి దేవరాయ మహారాయలవారి దర్శనంచేసిన దృశ్యాన్ని గురించి డుజారిక్ అనే ఫాదరీగారు ఇలాగ వర్ణించి యున్నారు:—

చాలా సోపానాలు ఎక్కి వెళ్లగా ఒక చిన్న సభామందిరంలో ఒక రత్నకంబళముమీద మహారాయలువారు ఒక దిండుకు ఆనుకుని కూర్చుని వున్నారు. ఆయన ప్రక్కనే యువరాజుగారు కూర్చుని వున్నారు. అతడు చాలా చిన్నవాడు; స్ఫురదూ్రపి; అవతలప్రక్క యువరాజు గారికి ఎదురుగా చక్రవర్తి మామగారైన ఓబరాయలవారు, వారితమ్ముడూ కూర్చున్నారు.

మహారాయలవారు పసుపు పచ్చని దుస్తులను ధరించి వున్నారు. తక్కిన ప్రభువు లందరు మామూలుగా చేసేలాగునే ఈఫాదరీలుకూడా జొహారులుచేసి నిలిచియుండగా వారినిగురించి ఓబరాయలవారివల్ల ఇదివరకే వినియున్నందువల్ల మహారాయలవారు, 'సూర్యోదయము వలెనే ఈ ఫాదరీలరాక తమకు చాలా ఆనందకరముగా నున్నదనిన్ని వారిని తగినటుల సత్కరించి పంపవలసినద'నిన్నీ సెలవిచ్చారు. అంతట ఫాదరీలు మహారాయుల వారికి వందనము లర్పించి తాము తెచ్చిన బహుమతులను సమర్పించారు.

వారు తెచ్చిన వాటిలో గాజుతోను బంగారుతోను పోర్చుగల్లులో తయారుచేసిన గుండెకాయలాంటి చిత్రమైన వస్తువు ఒకటి

వుండగా దానిని రాయలవారు చూసి ఇదేమిటని ప్రశ్నించారు. ఇది వెండి బంగారులతో తయారుచేసిన గుండికాయ యనిన్నీ రాయలవారి యందు తమకుగల ప్రేమను రాజభక్తిని కృతజ్ఞతను తెల్పగలందుకు దానిని బహుమతిగా సమర్పించుకుంటున్నా మనిన్నీ వారు మనవి చేశారు. అంతట మహారాయలవారు "మహా సంతోషం" అని తమ మాతృభాషయైన తెలుగులో అన్నారు. తరువాత శ్రీవారు ఆ క్రైస్తవఫాదరీలలో రెక్కారుగారికి నాలుగుపట్టుతాపితాలున్నూ ఫ్రాన్సిస్ రిచియోగారికి రెండు పట్టుతాపితాలున్నూ బహుమానం చేశారు. ఈ క్రైస్తవ మతప్రచారకుల జీవితవిధానాన్ని గురించి రాయలవారు దీర్ఘంగా ప్రశ్నించారు. వారి జవాబులన్నీ సావధానంగా విని తమ సభాసదులతో ఇలాగ అన్నారు "వీరుకూడా మన సన్యాసులవంటి వారే, అందుకనేకాదు వీరు విద్వాంసులుకూడాను!" అని రాయలవారు చాలా సేపు దర్శనం ఇచ్చి క్రైస్తవులు జనన మరణాల విషయంలో అవలంబించే ఆచారాలు ప్రాయశ్చిత్తాలూ వివరంగాఅడిగి తెలుసుకుని చాలా బాగున్నవని రాయలవారు సెలవిచ్చారు.

బ్రాహ్మణ కర్మలు విధించే స్నానాలు శరీరాలనే శుద్ధి చేస్తున్నవి గాని ఆత్మలను శుద్ధిచేయడం లేదనిన్నీ క్రైస్తవ ధర్మాలు విధించే జ్ఞానస్నానములు ప్రాయశ్చిత్తాలూ మానవుల పాపాలను కడిగివేసి ఆత్మలను శుద్ధి చేస్తున్నవనిన్నీ క్రైస్తవ మిషనరీ ఫాదరీలు చెప్పగా రాయలవారు విని అక్కడనున్న బ్రాహ్మణులను చూసి "ఈ విషయంలో మీరేమంటారు?" అని అడిగారు. రాయలవారీమిషనరీ ఫాదరీల నింతగా గౌరవించి వారిపైన అనుగ్రహం చూపుతూ వున్నప్పుడు తా మేమైనా అంటే రాయలవారికి ఆగ్రహం వస్తుందేమో అని అక్కడివారు "స్వామి; స్వామి" (చిత్తం, చిత్తం) అని వూరుకున్నారు."

ఈఫాదరీలకు ఖర్చుల నిమిత్తమున్నూ ఒక క్రైస్తవ దేవాలయం కట్టుకోగలందుకున్నూ రెండు గ్రామాలన్నూ, స్వాములున్నూ ప్రభువులున్నూ మాత్రం యెక్కితిరిగే బంగారు అడ్డపల్లకీ నొక దానినిన్నీ రాయలవారు దయచేసినారనిన్నీ తమ సామ్రాజ్యంలో

ఎక్కడనైనా సరే వీరు తమ యిష్టం వచ్చినచోట క్రైస్తవ దేవాలయాలు కట్టుకోవడానికి మహారాయలవారు అనుగ్రహించారనిన్నీ ఓబరాయలవారు సెలవిచ్చారు.

ఈ ఫాదరీలు తిరిగి వెళ్లే లోపుగా మహారాయలవారు మరియొక మాటు దర్శనం ఇచ్చి క్రైస్తవ మతధర్మాలను గురించీ సిద్ధాంతాలను గురించీ వీరివల్ల విన్నారు. తమ రాజధానియైన చంద్రగిరిలోనే ఒక క్రైస్తవ దేవాలయం కట్టుకోవడానికి అనుగ్రహించారు. అటుతరువాత ఈ క్రైస్తవ ఫాదరీలు శాంతోమునకు తిరిగి వచ్చారు.

(Du Jarric I pp. 654-675. Historical Fragments Orme p 61. Aravidu dynasty. H. Heras. pp. 464-467.)

చంద్రగిరి తాలింఖానా

చంద్రగిరిలో వెంకటపతి దేవరాయ మహారాయలవారి కాలంలో (1585–1614 మధ్య) వారి ఆ స్థానంలోనుండే రాజబంధువులు, సామంతులు, సరదారులు, ఉద్యోగులు మొదలైన తెలుగు ప్రభువులూ శ్రీమంతులూ వుపయోగించుకునే తాలింఖానా ఒకటి వుండేది. అది పాశ్చాత్య దేశాలలోనుండే "జిమ్నేసియుం" వంటిది. ఫాదర్ డు జారిక్ అనే పోర్చుగీసు క్రైస్తవమత ప్రచారకుడైన జెసూటుమిషనరీ ఈ సంస్థనుచూచి ఇలాగ వర్ణించాడు:—

"ఈతాలింఖానా కట్టివున్న ఆవరణలో మధ్య ఖాళీస్థలము నన్నసున్నమైతో నున్నగా అద్దములాగ పాలగచ్చుచేసి వున్నది దాని చుట్టూ విశ్రమించడానికి వీలుగా పరుపులాగ మెత్తగా వుండేటట్లుగా యెర్రని యిసుక ఒత్తుగా పోసియున్నది. ఇక్కడ శరీరవ్యాయామం చెయ్యడానికి వచ్చే శ్రీమంతులు దుస్తులన్నీ తీసివేసి లంగోటాలతోను కచ్చడాలతోను నిలుచుని వుంటారు. అంతట జెట్టీలనే బలాఢ్యులైన యువకులు ఈ ప్రభువులకు చక్కగా ఒళ్ళు పట్టుతారు. తరువాత వారూ వీరూ కలిసి దండెములు బస్కీలు తీస్తారు; కుస్తీలు పడతారు; మల్ల యుద్ధంచేస్తారు. ఇలాగ ఒళ్ళుగట్టిపడే అనేక రకాల కసరత్తులు సాములు ఒళ్ళంతా చెమ్మట పట్టేవరకూ చేస్తారు. తరువాత జెట్టీలు ఈ ప్రభువుల శరీరాలకు మెత్తనిమన్ను రుద్ది మళ్ళీ ఒళ్ళుపట్టి, కీళ్ళు

ఎముకలూ కదిలిపోయి ఊడివస్తాయా అనేటట్లుగా కాళ్ళను చేతులను అన్నివైపులకూ త్రిప్పి లాగి సాధకంచేసి తరువాత ఒళ్ళు దులుపుతారు. అటు తరువాత ఆ ప్రభువులు తమ శరీరానికి బాగా నూనె రాసుకుని మంచి వేడినీటిలో స్నానంచేసి ఒళ్ళుబాగా తుడుచుకుని తమ దుస్తులు ధరిస్తారు. ఇలాగ ఈ శ్రీమంతు లందరూ ప్రతిరోజూ భోజనానికి పూర్వం శరీరవ్యాయామం చేస్తూవున్నందువల్ల ఆరోగ్య దృఢగాత్రులై వుండి డెబ్బయియేళ్ళ వాళ్ళుకూడా ముప్ఫైయేళ్ళవాళ్ల లాగ కనబడతారు"

చెన్నపట్నం దగ్గిరవున్న శాంథోము కాలేజీ రెక్టారుగారైన ఫాదర్ సైమన్ డి. సాగారుకూడా ఒకసారి చంద్రగిరిలో ఈ తాలింఖానాను చూశారు.

(Aravidu Dynasty H. Heras. pp 313-314.)

మహారాయలవారు రాణివాసంతో వనవిహారానికి పోవడం

వెంకటపతి దేవరాయ మహారాయలవారికి వెంకటాంబ, రాఘవాంబ, పెద్దఓబమాంబ, పిన్న ఓబమాంబ అనే నలుగురు భార్యలున్నట్లు 1586-వ సంవత్సరపు శాసనంవల్ల కనబడుతూఉంది. ఇంకొక శాసనంలో పిన్న ఓబమాంబకు బదులుగా కృష్ణమాంబపేరు కనబడుతూవుంది. 1598 లో మహారాయలవారు రాణివాసముతో వనవిహారమునకు పోయిన దృశ్యాన్ని ఫాదర్ డు జారిక్ అనే జెసూటుక్రైస్తవమత ప్రచారకుడు ఇలాగ వర్ణించాడు:—

"పోర్చుగీసు క్రైస్తవమత ప్రచారకులైన జెసూటుఫాదరీలు కొత్తగా చంద్రగిరికిపోయియున్న రోజులలో ఒకనాడు మహారాయలవారు తమ మహారాజ్ఞులతో నగరానికి బయటనున్న ఉద్యానవనానికి విహరించబోయినారు... ఈ రాణివాసముతో వెళ్ళిన పరివారజనములో గొప్ప అశ్వికదళం ఒకటి యున్నది. ఆ దళాధిపతి ఒక మహమ్మదీయుడు. ఈ దళానికి నాలుగువైపులా నలుగురు గొప్ప సరదారులున్నారు. అందులో పట్టుకేతనాలు ఎగురుతున్నవి. దీని తరువాత పిల్లనగోవులు, వీణలు వాయించే మేళమున్నది. వాద్యములవారందరూ ఒంటెలమీద నెక్కి పోతున్నారు. ఈ పరివారంతో మంచి

కాల్బలముకూడా పోతున్నది. వీరితరువాత ప్రధాన సేనానాయకు లైన దళవాయిలు ఆయుధపాణులై పాదచారులై నడుస్తున్నారు. వీరి ప్రక్కను మహారాయలవారి పట్టపుటేనుగమీద విజయనగర రాజ లాంఛనము ఎత్తియున్నది. చుట్టూ ఇంకా చాలామంది రాజకీ యోద్యోగులున్నారు తరువాత నలుగురు బోయీలు ఒక పెద్ద యినుప జేగంటను మోస్తూఉండగా నలుగురు సైనికులు ఎడతెగకుండా దానిని మోగిస్తున్నారు. అంతట తమ చుట్టూ ఉద్యోగులు కొలుస్తూరాగా రాజసేవకులు నాలుగు తెల్లనిగొడుగులను పట్టియుండగా మహారాయల వారు ఒక బంగారు తంజాన్ పల్లకీలో కూర్చుని పోతున్నారు. ఈటెల మీద కేతనము లెగురుతున్నవి. ఒకదానిమీద పెద్ద తెల్లచామరము జీరాడుతున్నది. ఒక ధ్వజముమీద మత్స్యలాంఛనము, మరియొక దానిపైన సింహలాంఛనము, ఇదిగాక మరియొక గొప్ప ధ్వజము నున్నవి. వీటితరువాత సామ్రాజ్యసర్వసేనానియైన ప్రధాన దళవాయి ఉన్నారు. ఆఖరిని యువరాజైన రంగరాయలున్నా. నలుగురు మహా రాణులున్నా గత్నాలతో పొదిగిన జలతారు బుటేదారీ జాలరులు గల వెండిబంగారు తంజాన్ పల్లకీలలో కూర్చుని పోతున్నారు. ప్రతి పల్లకీకి సూర్యరశ్మి తగల కుండా రెండేసి గొడుగులు పట్టినారు. చాలా మంది దాసదాసీజనము రెండుప్రక్కలను విసనకర్రలతో విసురు తున్నారు. వింజామరలు వేస్తున్నారు. ఇలాగ నగరోపరిభాగాన్ని వున్న ఉద్యానవనానికిపోయి, అక్కడ కులాసాగా పొద్దుపుచ్చి సూర్యాస్తమయం అయిన తరువాత రాత్రిని పగలుగా మార్చేటంత కాంతి నిచ్చే దివిటీలతోను, కాగడాలతోను తిరిగివచ్చారు."

(Aravidu Dynasty - H. Heras pp. 496-497)

---

జా స్టీమరులో ప్రయాణము చేస్తున్నాడు. ఆయనకొమార్తె "ఈవా" అనేబాలిక చాలా దయార్ద్రహృదయ. టామ ఆమెను మచ్చిక చేసి కొనకలిగినాడు. ప్రమాదవశమువల్ల ఆమెనీటిలోపడగా టామామెను రక్షించాడు. అంతట ఈవాకోర కామెతండ్రి టామున్ను కొనివేశాడు.

సెంట్ క్లేరుదగ్గరనున్న బానిసలందరూ చాలాసౌఖ్యము లను భవించేవారు. తక్కిన యజమానుల లాగ అగస్టైనువారిని చీటికీ మాటికీ కొరడాలతో కొట్టడు, తిట్టడు, హింసింపడు; సరికదా వారికి చాలా చనువిచ్చి దయతో చూసేవాడు. వారితనిని తమతండ్రిలాగ చూచుకొంటారు. నీగ్రోచర్మము నల్లనిదైనా ఒడలి రక్తమాంస ములు తెల్లవారివంటివేకదా! అని యతడనేవాడు. తక్కిన తెల్లవారి కిది యిష్టములేదు. ఈవాతల్లి ఎల్లప్పుడూ ఏదోజబ్బులని మూలుగుతూ ఉండేది. అందువల్ల ఇంటిని చక్కబెట్టడానికీ ఈవాను సంరక్షించడానికీ సెంటు క్లేరు తన బంధువురాలైన ఒఫీలియా అనే యామెను కొన్నాళ్లు తనయింట నుండమన్నాడు. ఒఫీలియా పైకి కఠినురాలివలె కనబడినా బానిసత్వమంటే గిట్టని ఉత్తరరాజ్యములలో పుట్టి పెరిగిన దగుట వల్ల బానిసత్వమంటే ఆవిడకుకూడా గిట్టదు. అయినా తెల్లవారికి నల్ల వారంటే ఉండే అసహ్యము మాత్రమీమెకు కూడా ఉన్నది. అగస్ట యిను తన బానిసలకు చనువిచ్చి పాడుచేస్తున్నాడని ఆమె యభి ప్రాయము. కాని ఆమె ఆబానిసల సోమరితనమునకు వారినితిట్టక పనులన్నీ తానే నిర్వహించేది. తక్కిన తెల్లవారిలాగ తమపైన అధికారము చలాయిస్తూ ఊరికే కూర్చుండక ఈ తెల్లఆవిడ సామాన్యపు పనులన్నీ చేయడం చూడగా ఈబానిసలకు వింతగా నుండేది. అంతే కాదు, అలుసుగాకూడా ఉండేది. ఈమె గొప్పయింటివారి యాడ పడుచులాగ వారికి కనపడలేదు.

ఒక కల్లంగడిలో "టాప్సీ" అనే నీగ్రో బాలికనువాళ్లు ఎల్లప్పు డూ హింసిస్తూవుండడం అగస్టయినుకు కంటపడింది. అతనికి కనికరము కలిగి ఆ బాలికను కొని తెచ్చి ఒఫీలియావశము చేసినాడు. "మనకున్న కోతులమూక చాలదా? దీనిని గూడా ఎందుకు కొనితెచ్చినావని ఒఫీలియా అన్నది. తక్కిన బానిసలు కోతులైతే ఈ బాలిక కొండ

ముద్రిచ్చు అను సంగతి శీఘ్రముగానే రుజువైనది. దీనికి చాలా తెలివితేటలున్నవి. బుద్ధిపుట్టినా ఎన్ని పనులైనా చేస్తుంది - చక్కగా చేస్తుంది. కాని బుద్ధి మాత్రము పుట్టదు. ఎల్లప్పుడూ ఏదో యొక కొంటెపని చేస్తూనేవుంటుంది. ఏదో వస్తువును దొంగిలిస్తుంది. అబద్ధా లాడుతుంది. నీవు చేసిన తప్పు ఒప్పుకోమని ఒఫీలియా బెదిరిస్తే ఉన్నవీ, లేనివీ, కూడా తానే-చేశానంటుంది. ఎందుకిలాగ చేస్తున్నా వంటే "నేను దుర్మార్గురాలను కాబోలు! కొరడాతో నన్ను కొట్టండి, నాకది అలవాటు" అంటుంది. ఒక్కమాటు కొట్టితే ఇల్లు గగ్గోలుచేసి, ఒఫీలియా వెనుదిరుగగానే ఇగిలించి "అబ్బే ఈదెబ్బలొక లెక్కా! కల్లంగడిలో నన్ను బాదినబాదులలో నిది ఎన్నవవంతు?" అన్నది.

ఈవాయొక్క దయ, దాక్షిణ్యము, నెమ్మది, నీగొబ్బానిసలను ఆబాల గోపాలము నాక్షరించింది. ఎవ్వరిని కొట్టుటకుగాని, తిట్టుటకు గాని, ఆమెఅంగీకరింపదు. తనతల్లి అందరిని తిట్టడంచూసి ఈమె వగ చేది. సజ్జను లీ యుర్విపైన చిరకాలముండరు. ఆమెకు క్షయరోగము పుట్టి పెరిగినది. ఇక చాలాకాలము బ్రదుకనని యాకెగ్రహించి తన చుట్టూనున్న వారిపైన మరింత దయారసమును గురిపింపసాగినది. ఆమెకు టామము అంటే ప్రాణము. టాముకు ఆమెయంటే గుండెకాయే. ఈవా టాప్సీసంగతిచూచి దుఃఖించి ఒకనాడా పిల్లను దగ్గిరికి పిలిచి వీూద చెయ్యివేసి బుజ్జగించి, "టాప్సీ! నీ వెందుకిలాగ అల్లరిచేస్తావు?" అని కన్నీరుతో ప్రశ్నించింది. ఇలాంటి చల్లని మాట వినుటకు దయకు పాత్రురాలగుటకు టాప్సీకిదియే ప్రథమపర్యాయము. టాప్సీ ఆశ్చర్య పడింది. కన్నీరుతో "అమ్మా! నాకు ప్రపంచములో ఇది మంచి, ఇదిచెడ్డ, అని చెప్పినవారు లేరు. సహజంగా నేను దుర్మార్గురాలనని నాకు తోస్తున్నది. నేను నిజమాడినందుకు సంతసించినవారు లేరు. తప్పు చేస్తే మన్నించే వారునులేరు. ఒఫీలియా అమ్మగారయినను వాకునీళ్ళు పోసి బుద్ధులుచెప్పి సంరక్షిస్తూవున్న మాట నిజమే కాని నన్ను ముట్టు కోవడానికిఆమెకి అసహ్యం. నాపైన దయ ప్రేమ కలవారెవ్వరూలేరు. ఇలాంటి దురదృష్టవంతుల జాతికి చెందిన నాకు సత్యము, సత్ప్రవర్త నము ఎలా అలవడుతవి?" అని అన్నది. ఈవా కన్నీరు బొటబొట

# రాణీ వెంకటాంబగారి దొంగకానుక

1585 మొదలు 1614 వరకూ చంద్రగిరిని రాజధానిగా చేసుకొని విద్యానగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన వెంకటపతి దేవరాయ మహారాయలవారికి వెంకటాంబ, రాఘవాంబ, పెద ఓబమాంబ, పిన ఓబమాంబ యనే నలుగురు భార్యలున్నట్లు 1586 వ సంవత్సరపు శాసనంలో కనబడుతున్నది అయితే ఆ సంవత్సరములోనే లిఖింపబడిన దళవాయి అగ్రహారశాసనములో పిన ఓబమాంబ పేరుకు బదులుగా కృష్ణమాంబ పేరు కనబడుతున్నది. కృష్ణమాంబతో కలిపి నలుగురు భార్యల పేరులున్నూ 1598 వ సంవత్సరమునాటి శాసనాలలో కూడా వున్నవి. కృష్ణమాంబ ఓబమాంబకు మారుపేరో, లేదా ఆ పేరుగల యింకొక యామెను రాయలవారు మళ్ళీ పెళ్లి చేసుకొన్నారో తెలియదు.

1601 వ సం॥ విలపాక దాన శాసనంలో పైన చెప్పిన నలుగురు భార్యలపేర్లుగాక కొండాంబిక అనే ఐదవభార్య పేరుకూడా కనబడుతున్నది. అయితే వెంకటపతి రాయలవారి రాజ్యకాలంలో చివర భాగంలో రచియింపబడిన రామరాజీయమనే నరపతి విజయములో వెంకటమ్మ, ఓబమ్మ, కృష్ణమ్మ, కొండమ్మలనే నాలుగు పేర్లే కనబడుతున్నవి. అప్పటికి రాఘవమ్మగారు చనిపోయి వుంటుంది.

1614 లో రాయలవారు చనిపోయినప్పుడు ఆయనతో ముగ్గురు భార్యలు సహగమనం చేశారనిన్నీ, అందులో పెద్ద యామెకు దరిదాపుగా రాయలవారి వయస్సే వుంటుందనిన్నీ, తక్కిన ఇద్దరికీ చెరి ముప్ఫైయైదు సంవత్సరాలు వుంటాయనిన్నీ పోర్చుగీసు క్రైస్తవ పాదరీలు తమ అధికారులకు వ్రాసిన వుత్తరాలవల్ల కనబడుతున్నది. అప్పటి కిద్దరు భార్యలు చనిపోయి వుండాలి.

పెద ఓబమాంబ జిల్లేళ్ళ రంగరాజుగారి కొమార్తె. కృష్ణమాంబ జిల్లేళ్ళ కృష్ణరాజుగారి కూతురు. కొండాంబిక గొబ్బూరి ఓబరాయల కొమార్తె. ఓబరాయలు ఇంకొక కొమార్తెనుకూడా రాయలవారి కిచ్చి పెళ్ళిచేసినట్లు కనబడుతున్నది. వెంకటాంబగారు ఎవరికుమార్తెయైనదీ రామరాజీయములో నుదాహరించలేదు. బహుశా జగ్గరాజు

గారి కొమార్తె బాయమ్మ అని బర్రిడస్ పేర్కొన్న రాణిగారీమెయే అయివుంటుందని చరిత్రకారుల ఊహ.

రాయలవారి మామగారైన గొబ్బూరి ఓబరాయుల వారు రాయలవారికింద ఒక మహామండలేశ్వరుడైన సామంతరాజుగా నుండే వాడు. ఆయన కాంచీపురం రాజధానిగా ఆ ప్రాంతాలను పరిపాలించేవాడు. 1606 వరకూ వెంకటపతి దేవరాయల వారికి ఈఓబరాయలెంత చెపితే అంత. ఓబరాయలవారి కుమార్తె రాఘువాంబ, రాయల వారి కత్యంత ప్రేమాస్పదురాలైన భార్యగా నుండేది. ఆమె చనిపోయిన తరువాత ఓబరాయలవారి పలుకుబడి తగ్గింది.

రాఘువాంబగారు చనిపోయిన తరువాత రాయలవారి ప్రేమకు పాత్రురాలైన రాణీగారిని గురించి పోర్చుగీసు క్రైస్తవ ఫాదరీలు తమ వుత్తరాలలో పై వారికి అనేక వివరాలు వ్రాశారుగాని పేరు మాత్రం వుదాహరించలేదు. రాజకార్యాలన్నీ రాణీగారి యిష్టాను సారంగా జరుగుతున్నవనిన్నీ ఈ నల్లరాణీగారి వలపులో చిక్కి రాయలవారు ఆమెకు దాసులైనారనీ, శాంతోములో క్రైస్తవులకూ, గ్రామస్థులకూ వచ్చిన తగాదాలవల్ల రాణీగారు క్రైస్తవుల పైన కోపంగా వున్నవా రనిన్నీ ఆవిడకు సమర్పించవలసిన బహుమతులూ సొమ్మూ ఇస్తేనేగాని ఆవిడ ప్రసన్నురాలు కాదనిన్నీ ఫాదరీలు పై అధికారులకు వ్రాశారు. రాయలవారు తమ అధికారాలన్నీ ఈ రాణీగారికిన్నీ ఆవిడ సోదరుడికిన్నీ వప్పగించారని 1611 లో ఒక వుత్తరంలో వ్రాశారు. ఈమెను వులికాటు రాణీయని 1611 లో ఒక ఇంగ్లీషు కెప్తాను పేర్కొన్నందు వలనను వులికాటురాణీగారు ఓబమ్మయని ఒక డచ్చివర్తకుడు వుదాహరించినందువల్లను జిల్లెళ్ళ రంగరాజుగారి కొమార్తెయైన పెదఓబమాంబ యని చరిత్రకారులు ఊహిస్తున్నారు.

1607 నాటికే వెంకటపతి దేవరాయలవారు వయోవృద్ధులుగానున్నట్లు ఫాదరీలు వ్రాశారు. వెంకటపతి దేవరాయలవారి తండ్రి తిరుమలరాయలవారు పెనుకొండలో 1569 నుండి రాజ్యపరిపాలన మారంభించగానే వెంకటపతి దేవరాయలను రాజ ప్రతినిధిగా నియ

మించినందువల్ల అప్పటికే ఈయనకు యుక్తవయస్సు వచ్చియుండాలి. 1508 మొదలు 1611 వరకూ పాదరీలు వ్రాసిన యుత్తరాలన్నింటి లోను రాయలవారి వార్ధక్యాన్ని గురించి వ్రాస్తూనే యున్నారు.

1613 లో ఒక పాదరీ పోర్చుగల్లురాజు గారికి వ్రాసిన యుత్తర ములో రాయలవారు అతివృద్ధులై పోయినారనిన్నీ, ఇప్పుడో ఇకనో చనిపోతారని అందరూ అనుకుంటున్నా రనిన్నీ వ్రాశాడు.

## కృత్రిమ గర్భధారణం

సంకటపతి దేవరాయ మహారాయలవారి భార్యలలో ఎవ్వరికీకూడా పుత్రసంతానం కలుగలేదు. రాయలవారికి వయసు మళ్ళింది. ఇక పిల్లలు కలుగుతారనే ఆశ నిరాశ అయిన తరువాత పెద్దభార్య వెంకటాంబగారు ఒక తంత్రంపన్ని తాను కడుపుతో నున్నట్లు నటించి రాయలవారిని మోసగించి ఒక బ్రాహ్మణ శిశువును తెచ్చి తాను కన్నట్లు ప్రకటించింది. ఈ చిత్రకథను గురించి బరడన్ అనే పాదరీ ఇలాగ వర్ణించాడు.

"ఈ పెద్దరాణీగారు పిల్లలకోసం పరితపిస్తూవున్న సంగతిన్ని, పిల్లలు కలగక పోవడమున్నూ చూసి ఆవిడ తండ్రిగారికి ఆశ్రితులుగా నున్న ఒక బ్రాహ్మణ కుటుంబంలోని ఒక స్త్రీ తనకు నెలతప్పిన దనిన్నీ తనకు తప్పకుండా మొగపిల్లవాడు కలుగుతాడనిన్నీ ఇప్పుడే రాణీగారుకూడా తనకు నెలతప్పినదని ప్రకటిస్తే నెలలు నిండిన తరువాత తనకు కలిగే పిల్లవాడిని పొత్తిళ్ళలో నుండగానే రెండవకంటి వారికి తెలియకుండా తమపక్కలో వేసుకుని తాము కన్నట్లు చెప్ప వచ్చుననిన్నీ సలహా చెప్పగా రాణీగారు ఆ ప్రకారం తాను కడుపుతో వున్నట్టు నటించారు.

## బ్రాహ్మణపుత్రుడు

బ్రాహ్మణ స్త్రీకి నెలలునిండి పిల్లవాడుకలుగగా ఆ పసికందు పిల్లవాడిని రహస్యంగా రాజభవనంలోనికి తెప్పించి తమకు కాన్పు వచ్చి నట్లున్నూ మొగపిల్లవాడు కలిగినట్లున్నూ ప్రకటించింది.

ఈమోసం సంగతి, ఎలాగో రాయలవారి చెవిని పడింది. అయితే దీనిని గురించి గడబిడచేస్తే తమకూ రాణీగారికీకూడా అప

కీర్తి కలుగుతుందని తోచి ఏమీ ఎరగనట్లు ఊరుకుని పుత్రోత్సవం జరిపి కుర్రవాడికి చిక్కరాయలని నామకరణం చేశారు.

విద్యానగర చక్రవర్తులు తమ తరువాత రాజ్యానికి వచ్చే యువరాజులను చిక్కరాయలని వ్యవహరించేవారు. అందువల్ల రాయలవారు రీబాలుణ్ణి యువరాజుగా అంగీకరిస్తారనే చాలామంది అనుకున్నారు కాని క్రమక్రమంగా ఈ కుర్రవాడి విషయంలో రాయలవారి ప్రవర్తన చాలా వింతగా నున్నట్లు కనపడింది.

రాజకుమారుడికి జరగవలసిన ముద్దుముచ్చటలు జరపడంలో లోపం ఏమీ చేసేవారు కారు కాని రాయలవారు అతడిని తమ కడుపున పుట్టిన పిల్లవాడిని చూసినట్లు మాత్రం చూసేవారు కారు. ఆ కుర్రవాడిని ఎల్లప్పుడూ అంతఃపురంలోనే వుంచేవారు. ఎక్కడికైనా రాణి వాసముతో పోవలసినదేగాని ఒంటరిగా పోవడానికి వీలులేదు. విడిగా పోవాలంటే రాయలవారి అనుజ్ఞను ముందుగా పొందాలి. ఇలాగ అదుపు ఆజ్ఞలలో నుంచారు. పదునాలుగేళ్ళు రాగానే రాయలవారు తమ బావమరది కూతుర్నిచ్చి ఈ పిల్లవాడికి వివాహంకూడా జరిగించారు. ఎన్నిచేసినా యువరాజు కిచ్చే మర్యాదలు మాత్రం చిక్కరాయలకు జరిగించలేదు. తనకుమారుడు రాయలవారి తరువాత రాజ్యం చేస్తాడనే ఆశ వెంకటాంబగారికికూడా 1610 నాటికే లేదు.

## రంగరాయలు

వెంకటపతి దేవరాయలవారి తరువాత ఎవరు రాజ్యానికి వస్తారనే విషయం 1600 నాటికే ఆలోచనలో నున్నది. రాయలవారి అన్నగారున్నూ శ్రీరంగపట్నానికి రాజప్రతినిధిగా నుండినవారున్నూ అయిన రామరాయల వారికి తిరుమలరాయలనిన్నీ చామరాజనే రంగరాయలనిన్నీ ఇద్దరు కుమాళ్ళు. వారిలో రెండవ కుమారుని మీదనే వెంకటపతి రాయలవారికి ఎక్కువ పేమ. రాయలవారు కూర్చునే రత్నకంబళీము మీద చిక్కరాయలనే యువరాజు తప్ప ఇతరులెవ్వరూ కూర్చునే ఆచారంలేదు. 1598-9 సంవత్సరాలలో జెసూటు క్రైస్తవ ఫాదరీలు రాయలవారి దర్శనానికి పోయినప్పుడు రాయల

వారు కూర్చున్న తివాచిమీద ఆయనకు దగ్గరగా ఈ రంగరాయలే కూర్చుని యున్నాడని ఫాదరీలు వ్రాశారు.

రామరాయల తరువాత ఆయన పెద్దకుమారుడైన తిరుమల రాయలు శ్రీరంగపట్నానికి రాజప్రతినిధిగా నుండి పరిపాలించాడు. ఆసందర్భంలో కొన్ని విషయాలలో అతడు జరిగించిన చర్యలవల్ల రాయలవారికి అతనిపైన అనుగ్రహం తప్పింది. మైసూరు దగ్గర చిన్న సామంతుడుగా నుండిన రాజఒడయరు 1610 లో ఈ తిరుమల రాయలను త్రోసిరా జన్నాడు. 1612 లో వెంకటపతి రాయల వారీరాజఒడయరును సామంతరాజుగా అంగీకరించారు.

## మ ర ణ శా స న ము

వెంకటపతి రాయలవారికి అవసానకాలం ఆసన్నం కాగానే ఆయన రంగరాయలనే తమ తరువాత సామ్రాజ్యాన్ని పరిపాలించ వలసిన రాజుగా నియమించారు. ఆఘట్టాన్ని గురించి బర్రడస్ ఇలాగ వర్ణించాడు.

"ఇక మూడురోజులకు చనిపోతా మనగా రాయలవారు తమ మంత్రిలు సామంతులు మొదలైనవారి సమక్షంలో వెంకటాంబ గారు కన్నట్లు చెప్పే కొడుకును తృణీకరించి తమ అన్నగారి రెండవ కుమారుడైన రంగరాయలను తమ దగ్గరికి పిలిపించి తమ చేతి ముద్దుటుంగరమును తీసుకుని తమ తరువాత రాజ్యం చేయవలసిందని చెప్పి తమ చేతిని ఆయనవైపునకు చాపినారు. అంతట రంగరాయలకు పట్టలేని దుఃఖము వచ్చి తలవంచుకుని తనకు రాజ్యం అక్కర లేదనిన్నీ దాని నెవరికైనా ఇవ్వవలసిందనిన్నీ అని రాయలవారి పాదములమీద ప్రణమిల్లి ఏడువ సాగినాడు. ఆయనను లేవదీయవలసినదని రాయల వారు అక్కడ నున్నవారితో చెప్పగా వారు రంగరాయలను లేవదీసి రాయలవారి కుడివైపున కూర్చుంచ బెట్టారు. అంతట రాయలవారు తమ ఉంగరమును తీసికొనవలసినదని అతనికి చెప్పి తమ కుడిచేతిని మళ్ళీ అతని దగ్గరకు చాపినారు. కాని రాజకుమారుడు తన చేతులను తన తలమీద పెట్టుకుని తన్ను క్షమించవలసినదని రాయలవారిని వేడు కున్నాడు. అంతట వృద్ధ రాయలవారు తమ వ్రేలి యుంగరమును

తామే తీసి వ్రేలి చివర వ్రేలాడేటట్లుంచి మళ్ళీ చిక్క (రంగ)రాయల కివ్వబోగా అక్కడ నున్న సామంతు లందరూ చెప్పినమీదట ఆ రాజ కుమారుడు దానిని స్వీకరించి, శిరసావహించి కన్నీరుకారుతూవుండగా దానిని తన చేతివ్రేలికి పెట్టుకున్నాడు. తరువాత రాయలవారు రెండు లక్షల విలువ చేసే తమ చీనిచీనాంబరాలను, ఆరు లక్షల విలువచేసే తమ చెవిని ధరించే పెద్ద వజ్రములజతను, రెండు లక్షల విలువచేసే మంచి ముత్యాల సరములున్నూ తెప్పించి ఈ రాజలాంఛనముల నన్నింటినీ రంగరాయల కిచ్చి ఆయనను రాజుగా ప్రకటించారు."

(The Aravidu Dynasty. H. Heras pp. 494-507)

# రామదేవరాయల పట్టాభిషేకము

వెంకటపతి దేవరాయలవారు 1614 లో చనిపోగా ఆయన అన్నకుమారుడైన శ్రీరంగరాయలవారు సింహాసనము అధిష్ఠించారు. అయితే వీ రెంతో కాలం రాజ్యం చెయ్యలేదు.

రాణీ వెంకటాంబగారి సోదరుడైన గొబ్బూరి జగ్గరాజుగారు చాలా చండశాసనుడు, క్రూరుడు, స్వార్థపరుడు, దుర్మార్గుడు. ముందుగా తన మేనల్లుడుగా ప్రకటింపబడిన పిల్లవాడి పక్షంవహించినట్లు నటించి తరువాత తానే రాజు కావచ్చునసే ఆలోచన జగ్గరాజుగారికి కలిగింది. అంతట జగ్గరాజుగారు కొందరు దుర్మార్గులను చేరదీసి శ్రీరంగరాయలను సకుటుంబంగా చెరపెట్టించి ఆ పిల్ల వానిని రాజ్యాన నిలిపినాడు. చాలామంది సరదార్లు బలవంతుడైన జగ్గరాజు పక్షాన చేరారుగాని ధర్మాత్ముడైన యాచమనాయుడుగారు (నేటి వెంకటగిరి వారి పూర్వీకుడు) ఈఅన్యాయానికి ఒడిగట్టలేక జగ్గరాజుతో చేరలేదు. పైగా కులగోత్రాలు తెలియని ఆ పిల్లవాడిని రాజుగా అంగీకరించి అతడికి లోబడడం పరువుతక్కువ అని ప్రకటించి చెరలో నున్న రాజకుటుంబాన్ని విడిపించేటందుకు ప్రయత్నించ సాగినాడు. అక్కడి చాకలివాణ్ణి తనవశం చేసుకుని వాడిచేతి కొక చీటీ వ్రాసి యిచ్చి ఖైదులోనున్న శ్రీరంగరాయలవారికి చూపించి ఎలాగైనా ఆయన కొమారుణ్ణి ఎత్తుకుని రావలసినదని చెప్పి పంపించాడు. శ్రీ

రంగరాయలవారి చీటీ చూసుకుని చాలా సంతోషించి పన్నెండేళ్ల వయస్సుగల తమ రెండవ కుమారుడైన రామదేవరాయలనే బాలుణ్ణి తీసుకొని పోవలసినదని అనుజ్ఞ నిచ్చారు. అంతట ఆ చాకలివాడా పిల్లవాణ్ణి తన మూటికి గుడ్డలమూటతో నొక గంపలో పెట్టి బయటికి తెచ్చి యాచమనాయడిగారి దగ్గర సురక్షితంగా చేర్చినాడు.

రామదేవరాయలు బయటపడిన సంగతి విని చాలామంది సరదార్లు యాచమనాయుడి పక్షాన చేరారు. ఈ సంగతి తెలిసేటప్పటికి జగ్గరాజు గుండెల్లో రాయిపడింది. సరదార్లను ఇయాన భయాన లంచాలిచ్చి బెదిరించి తన పక్షాన నిలుపుకొంటూ రంగరాయల కుటుంబంవారు తప్పించుకుని పోవకుండా చెరసాలకు బందోబస్తు యెక్కువచేసి జాగ్రత్తగా కాపలాకాయించడం ప్రారంభించాడు. అక్కడ యాచమనాయుడు గారున్నూ ఎలాగైనా రంగరాయల వారిని సకుటుంబంగా చెరలోనుంచి తప్పించాలని విశ్వప్రయత్నాలు చేస్తూ ఆ బందికానామనుష్యులను కొందరిని వశపరచుకొని బయటినుంచి చెరసాలలోకి ఒక నేలసొరంగము తవ్వించాడు. దానిగుండా రాయలవారిని బయటికి రప్పించాలని ప్రయత్నిస్తూ వుండగా బయట పారాయిచ్చే బంటువాడొకడు ఆ సొరంగంమీద అడుగువేసి దిగబడినందువల్ల గల్లంతు అయి ఈ రహస్యం బయట పడింది. ఈసంగతి జగ్గరాజుకు తెలియగా అతడు మండిపడి శ్రీరంగ రాయలను ఆయన భార్యను కొడుకును కోడలిని చిన్నబిడ్డలను అందరినీ చంపించాడు. ఇది వినేటప్పటికి రాజధానిలోని జనులందరూ అట్టుడికినట్టు ఉడికిపోయారుగాని జగ్గరాజుకు భయపడి ఎవరూ మాటాడ లేక పోయారు. యాచమనాయడిపట్టున స్నేహభావం హెచ్చిందిగాని పైకివచ్చి ఎవ్వరూ సహాయం చెయ్యడానికి సాహసించలేదు.

అక్కడ యాచమనాయడికికూడా రామరాయలను సంరక్షించే భారం చాలా దుర్భరమైపోయింది. ఇంక జగ్గరాజు తనమీదికి వచ్చి పడకమానడని యాచమనాయడికి తోచింది. అందువల్ల ఆ పిల్లవాడిని ఎక్కడికైనా పంపి కాపాడడం మంచిదని తోచింది. పిల్లవాడిపితృవ్యపుత్రుడు తిరుమలరాయలు శ్రీరంగపట్నానికి పరిపాలకుడుగా నుండిన

యాతడు ఇదివరకే వెంకటపతి దేవరాయలవారిపట్ల కొంత అతృప్తిని వహించియున్నందువల్ల అతడా పిల్లవాడిని రక్షిస్తాడనే నమ్మకం లేదు. విజయనగరసామ్రాజ్యానికి సామంత మండలేశ్వరులుగా నున్న మధుర జింజీలనేలే నాయకు లంత విశ్వాసపాత్రులుగా లేరు. ఒక్క తంజావూరును పరిపాలించే అచ్యుతప్ప నాయకుడుమాత్రం వెంకటపతి దేవరాయలవారిపట్ల భక్తివిశ్వాలు కలిగియున్నాడు. అచ్యుతప్పనాయకుడి కుమారుడైన, రఘునాథనాయకుడు అప్పటికే తన తండ్రికి రాజ్యపరిపాలనలో తోడ్పడుతూ మహాశూరుడని సాహసౌదార్యాది సద్గుణములను కలిగినవాడని పేరుపొంది యున్నాడు. ఈ తంజావూరువారి సహాయం కోరితే వారు తప్పకుండా రాజకుమారుణ్ణి రక్షిస్తారని యాచమనాయడికి తోచింది. అంతట యాచమనాయడు రామ దేవరాయలతోను కొద్దిపరివారముతోను బయలుదేరి మధుర జింజీలనేలే సామంతులకు కూడా తెలియకుండా ప్రచ్ఛన్నంగా ఇతరులు పోయేమార్గాన గాక తూర్పు సముద్రతీరము వెంబడిని తంజావూరుకు ప్రయాణమై తాము వస్తూవున్న కార్యమును గురించి ముందుగా రఘునాథ నాయకుడికి చారులద్వారా కబురు పంపించాడు.

రఘునాథనాయకుడున్నూ జరిగిన సంగతులన్నీ విని చాలా విచారించి యాచమనాయడి ప్రభుభక్తికీ ఔదార్యానికీ మెచ్చి రామ దేవరాయలకు తప్పకుండా సాయం చేస్తామని అభయమిస్తూ కబురు పంపించాడు. అక్కడ జగ్గరాజున్నూ వేగులవాళ్ళ ద్వారా సంగతులు తెలుసుకుని రఘునాథ నాయకుడితో యుద్ధము తప్పదని గ్రహించి ఇందులో తనకు సహాయం చేయవలసినదని అప్పట్లో మధురను జింజిని పరిపాలిస్తూవున్న ముద్దు వీరప్పను కృష్ణప్పను కోరినాడు. ఈ సందులో తంజావూరు మీద తమకక్ష సాధించుకోవచ్చుననే యూహతో వారు పరేనన్నారు.

యాచమనాయడున్నూ రామ దేవరాయలున్నూ తంజావూరు చేరినట్లు రూఢిగా తెలియనందువల్ల వారు కావేరినదిని దాటకుండా చెయ్యాలని సంకల్పించి జగ్గరాజు కావేరి ఆనకట్టను తెగగొట్టించాడు. ప్రజలందరికీ ఉపయోగించే ఆనకట్టను ఇలాగనాశనం చేసినట్లు రఘు

నాథనాయకుడికి తెలియగా ఆయనకు చాలాకోపం వచ్చింది. ఇలాంటి దుర్మార్గాన్ని చేసిన ఆజగ్గరాక్షసుని చేతులను నరికి అతన్ని వధిస్తానని రఘునాథనాయకుడు శపథంచేశాడు. తంజావూరు మహామంత్రియైన గోవిందదీక్షితులవారి కొమారుడున్నూ రఘునాథ నాయకుడి శిష్యుడున్నూ అయిన యజ్ఞనారాయణ దీక్షితులవారు సంస్కృతంలో రచియించిన సాహిత్యరత్నాకరంలో ఈ శపథాన్ని ఇలాగ వివరించారు.

"ఛిన్నైర్జగ్గనృపాదిబాహుజనుషాం సేతుం శిరఃకర్పరైః
కావేర్యాం యుధి బంధయామి సుదృఢం కామం తదాఽఽఽం భస్మైః
స్పష్టం తైర్విద్రుతాభిరేవ లిపిభిః స్వాయంభువాభిర్యథా
కర్తవ్యం జయరేఖికా విరచనం కల్పేత కల్పావధి"

యాచమనాయడు రామదేవరాయులతో వస్తూవుండగా వారిని దారిలోనే అటకాయించాలని మధురజింజీల నేలే నాయకులు ప్రయత్నిస్తున్నారని తంజావూరు మహామంత్రియైన గోవిందదీక్షితులవారికి తెలిసింది. అంతట వారిని నిర్జించి జగ్గరాజుతో యుద్ధముచేయవలసిన బాధ్యతను వయసుమళ్లిన అచ్యుతప్పనాయకుని మీద పెట్టడంకన్న నడివయస్సులో నున్న యువరాజైన రఘునాథునిమీదనే పెట్టడం యుక్తమని ఆయనకుతోచి ఈ సంగతిని అచ్యుతప్పనాయకుడికి చెప్పి రఘునాథుడికి వెంటనే పట్టము గట్టించాడు. రఘునాథనాయకు డంతట తన పరివారముతో యాచమనాకుడికి రామదేవరాయలకు ఎదురుగా వెళ్ళి వారిని కుంభకోణముదగ్గర కలుసుకుని సబహుమానంగా కోటలోకి తీసికొనివచ్చి సురక్షితంగా ప్రవేశపెట్టినాడు.

రఘునాథనాయకుడు నేపాళమని వ్యవహరింపబడే జాఫ్నాలో నున్న పోర్చుగీసువారితోను పాండ్యతుండీరములని వ్యవహరింపబడే మధురజింజీలనేలు నాయకులతోను గొబ్బూరి జగ్గరాజుతోను యుద్ధములుచేసి జయించినసంగతి అనేక కావ్యములలో రసవంతముగా వర్ణింపబడినది.

రఘునాథనాయకుడు 1616 లో జరిగిన యుద్ధములో జగ్గరాజును వధించి రామరాయలవారికి పట్టాభిషేకము చేయించగా రామదేవరాయలవారు 1632 వరకూ చంద్రగిరిలో రాజ్యం చేశారు.

అందుగుల వెంకన్న యనే కవి నరపతివిజయమనే నామాంతర, ముగల రామరాజీయములో రఘునాథుణ్ణి మహాభారతయుద్ధములోని శ్రీకృష్ణునితో పోలుస్తూ ఈ విషయమును ఇలాగ వర్ణించాడు.

సీ. సింగనృపతి భీమసేనుఁడు రాయప్ప
శ్వేతాశ్వుఁ డయ్యన చిన్ననృపులు
మాద్రేయు లితరభూమండలేశ్వరులు వి
రాట పాంచాలాది రథికవరులు
రఘునాథనాయకాగ్రణియగు కృష్ణ స
హాయమ్ముగాఁగను నాజిఁ జెంచు
వీగప్రయాచక విభుమాక భూప దు
శ్శాసన సౌబలశల్యకర్ణ
గీ. యుక్తముగ జగ్గరాజదుర్యోధనుని న
థించి పంతసమున రామదేవరాయ
ధర్మతనయుండు ప్రజలు మోదంబెలర్ప
ధరణిఁ బాలించె ధర్మవిస్ఫురణ మెఱయ.

(చూ: బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులుగారు ప్రకటించిన తంజావూరి రాజుల చరిత్ర పీఠిక. పుటలు 15-18; (బ్ర. శ్రీ. కురుగంటి సీతారామయ్యగారి తంజాపు రాంధ్ర నాయక రాజచరిత్ర 4-వ ఉపన్యాసము.)

---

# అయోధ్య నవాబుగారి సీమమంగలి

తూర్పు ఇండియా వర్తక కంపెనీ అనే పేరుతో భారత దేశంలో ఆంగ్లేయులు పన్నిన రాజ్య తంత్రపు వలలో నీ దేశపు నవాబులను రాజులను పడవేసియుంచి యుద్ధములకనీ, సైనికపోషణ కనీ, ఇంకా ఇతర ఖర్చులకనీ, తఫిరీకులకనీ, సొమ్ము లాగే వారు కంపెనీ వారి ఆంగ్లేయోద్యోగులు తమ యాధికారాన్ని ఏలు వెంబడిని ఉపయోగించి అనేక మాయోపాయాలను పన్ని ఈ రాజులను పీడించి లంచ పంచాలను పుచ్చుకొనేవారు. ఈ నవాబుల చుట్టూ చేరిన ఆంగ్లేయ తార్పుడు గాండ్రును దుర్మార్గులును వీరిని వంచించి దుర్వ్యసనాలలో దింపి ఎంతో ధన మపహరించేవారు.

ఈ నవాబులూ, రాజులూ, భోగలాలసులై వ్యభిచారము లోను, సురాపానములోను మునిగి దుర్వ్యయము చేస్తూ ఒళ్ళు తెలియకుండా ఉండేవారు ఈ రాజుల దర్బారులు ఇంద్రసభలలాగ వుండేవి. ఎక్కడ చూసినా వేశ్యలు. ఎక్కడ చూచినా నటకులు; గాయకులు. రాత్రిం బవళ్ళు ఉత్సవాలూ, ఊరేగింపులూ సాగుతూ వుండేవి. ఇంగ్లీషు పరిపాలకులూ, ఉద్యోగులూ అధికారులుకూడా ఈ రాజులను, నవాబులనూ పొగుడుతూ వీరి ఆతిథ్యం పొందుతూ ఆ సౌఖ్యాలు తాముకూడా అనుభవించేవారు. వీరిని మెప్పించడాని కీ దురదృష్టవంతు లింకా ఎక్కువగా సొమ్ము ఖర్చు చేసేవారు. ప్రజల నెంత పీడించినా ఈ దుర్వ్యయాలకు సొమ్ము చాలేదికాదు. అందువల్ల ఈరాజులూ, నవాబులూ సొమ్ముకోసం సదా బాధపడుతూ వుండేవారు. అంతట దేశీయులలోనూ, దొరలలోనూ కొందరు వీరికి అత్యధికమైన వడ్డీలకు అప్పులిచ్చే వ్యాపారము సాగించారు. వారి అవసరమునుబట్టి తమ అధికారమును బట్టి దొరలు ప్రతిఫలరహితములైన పత్రాలుకూడా వ్రాయించుకునేవారు. వారివల్ల నూటికి 24 మొదలు 48 వరకూ సాలుసరి కాంపౌండు వడ్డీలపైన పత్రాలు వ్రాయించి బాకీకి తొందర చేసి ఇంగ్లీషు ప్రభుత్వమునకు చెప్పి ఒత్తిడి చేయించి జాగీరులు వ్రాయించుకొని శిస్తులు తాకట్టు వ్రాయించుకొని రాజ్యంలో చాలా అక్రమాలు చేసేవారు. ఈ బాకీలు కొన్నికోట్ల రూపాయిలకు పెరిగిన తరువాత పాపము బ్రద్దలైంది. ఆర్కాటు నవాబు తంజావూరు రాజు అయోధ్యనవాబు బాకీల చరిత్ర చదివిన వారందరికి ఈ సంగ తులు తెలుసును.

అయోధ్య రాజ్యాన్ని ఏలే నవాబు మొదట మొగలాయి చక్రవర్తిగారి వజీరు. ఇతను స్వతంత్రుడై తరువాత తనకాశ్రితులైన ఇంగ్లీషువారికి దాసుడైనాడు. ఇంగ్లీషు వర్తక సంఘంవారి హయా ములో అయోధ్యనవాబు రాజధానియైన లక్ష్మణపురి (లక్నో) ఒక వంద సంవత్సరాలు తాప్పుడు గాండ్రతోను కుంటెనలతోను గాయ కులతోను వేశ్యలతోను పాశ్చాత్య దళారీలతోను నిండిపోయిన దని పాశ్చాత్య చరిత్ర కారులే వ్రాసియున్నారు.

అక్కడ రాత్రింబవళ్ళు నృత్యములు సంగీతములు ఉత్సవములు విందులు జరుగుతూ వుండేవి. అయోధ్య నవాబు గారి దర్బారుయొక్క విభవము వర్ణనాతీతంగా నుండేది. అతను చేసే ఖర్చుకు మితిలేదు. దీనివల్ల ఆయన అప్పులపాలైనాడు. ఆయన ఆతిథ్యాన్ని అనుభవించి ఆయనవల్ల సొమ్ము గుంజుకున్న దొరలు విశ్వాసహీనులై అతడు దుష్పరిపాలకుడనీ, పనికిమాలినవాడనీ నిందించి అతనిమీద ఇంగ్లీషు ప్రభుత్వాధికారులకు ఎన్నో కొండెములు చెప్పడం ప్రారంభించారు. చివరకు ఇంగ్లీషు ప్రభుత్వమువారు ఈనెపంతో అయోధ్యరాజును పదభ్రష్టునిజేసి 1856 లో ఆయన రాజ్యాన్ని లాక్కున్నారు.

అయోధ్య నవాబుగారికి "అయోధ్యరాజు" అనే బిరుదు వుండేది. దానికి తగిన దర్జానతడు ప్రదర్శించేవాడు మహాభోగము లనుభవించిన నాజరుద్దీన్ హైదర్ అనే పేరుగల అయోధ్యరాజు 1837 వ సంవత్సరం జూలై నెల 7 వ తేదీన స్వర్గస్థుడైనాడు. ఆ తన తరువాత నజీరుద్దౌలా నవాబు అయినాడు. ఇతను కూడా భోగలాలసుడే ఈనవాబులకు ఇంగ్లీషువారన్నా వారి నాగరికతయన్నా చాలా వ్యామోహం ఉండేది. నవాబుగారు తన అంతఃపురంలో ఇంగ్లీషు భోగవస్తువులను విరివిగా ఉపయోగించేవాడు. ఇంగ్లీషు స్త్రీపురుషులకు భారీగా ఆతిథ్యంఇచ్చి గౌరవించేవాడు. ఇంగ్లీషు పద్ధతి విందులను చేస్తూ ఖరీదు గల, సీమ సారాయముల నుపయోగించేవాడు.

నవాబుగారికి ఒక తెల్లమంగలిచేత క్షవరం చేయించుకోవాలని బుద్ధిపుట్టింది. అంతట తనకు పనిచేయడానికి ఒక తెల్లమంగలిని నియమించాడు. అలాగ అతణ్ణి నియమించడంలో రాజకీయ కారణాలు కూడా వుంటే వుండవచ్చును.

అప్పటి గవర్నరు జనరలు ఆక్లండ్‌గారి సోదరి గౌరవనీయురాలైన ఎమిలీ ఈడెన్‌గారు 27-3-1837 వ తేదీన సీమకు వ్రాసిన జాబులో ఈవిషయం వుదాహరించియున్నది.

"గవర్నరు జనరలు ఇంటి మంగలియైన ఒక పాశ్చాత్యుణ్ణి అయోధ్య నవాబుగారు నెలకు నాలుగువందలు రూపాయిల జీతముమీద తన దర్బారు మంగలిగా నియమించాడు. ఆ జీతము మాత్రమేగాక ఈ

భాగ్యశాలికి ప్రతినెలా బహుమతులద్వారా ఇంకాఅంత మొత్తం ముట్టుతుంది. పైగా రాజుగారి అనుగ్రహానికి వీడు పాత్రుడైనాడంటే వాడి పుణ్యం పుచ్చిందన్నమాటే. ఈ మంగలికి పూర్వం ఆ పనిలోనే నియమించబడిన ఇంకొక తెల్లవాడు పదమూడు పదునాల్గు లక్షల రూపాయిలు మూటగట్టుకుని సీమకు తరలివెళ్ళాడు." అని ఈడెన్‌గారు వ్రాశారు.*

---

# వీరభోగ వసంతరాయుడు

కలియుగం అంతమవుతుందనీ కృతయుగం ప్రారంభమవుతుందనీ యుగపురుషుడొకడు పుట్టి పాలించాల్సి ఉద్ధరిస్తాడనీ, చెప్పే పోతులూరి వీరబ్రహ్మంగారి వాక్యాలకు ఇప్పటికీ తత్వాలుపాడే వారి నోటంట వింటూ వుంటాము.

"చెప్పలేదంటనక పోయ్యేరు, నరులారా గురుని, చేత మొక్కి, తె బ్రతుక నేర్చేరు ॥చె॥

తప్పదిదిగో, గురుని వాక్యము, తెప్పలోన పోవునారలు, చప్పరించి మ్రింగు శక్తులు ॥చె॥

*    *    *

కేక వేసియు ప్రాణమిడిచేరు, [illegible] కాకబట్టి కలవరించేరు, ఆకాశము ఎర్రనౌను, అరువతేములు ఒక్క పౌను, లోకమందున జనులు అందరు, నీరు నిప్పున మునిగిపోదురు ॥చె॥

అగలు విడిచి పొగలు దాటిను, పగటి పట్టపగలు చుక్కలు చూచి భ్రమసేరు, భుగులు భుగులు ధ్వనులు మింటను, పుట్టియోగిన పిమ్మటను, దిగులు పడుచు ప్రజలు చాలా దిక్కు లేని పక్షులౌదురు ॥చె॥

*    *    *

ఏమొయేమో మొరుగకున్నారు, ఎండెండు [illegible]చిన యముని పురికే నడువ మంటూరు, భూతలంబున నిట్టి వింతలు, పుట్టి యణగిన

* (Emily Eden: Letters From India I p p 340-1, British Rule-Thompson and Garratt p p 298—300)

పిమ్మటను, నీతికృతయుగ ధర్మమప్పుడు, నిజము · నిలకడమీద తెలియును ॥చె॥

* * *

కీడులయినను కూడదందురు, ఒనగూడి నప్పుడు ఏడజూచిన వాడుకొందురు, వేడుకతో పోతులూరి, వీరభోగవసంతరాయలు, యేడు దీవులు ఏకచక్రము నేలును బ్రహ్మాండ మంతయు ॥చె॥"

ఇలాంటి అభిప్రాయాలు అన్ని దేశాలలోను అన్నిమతాల వారిలోనూ అనేక కాలాలలో వ్యాపించి యున్నట్లు దాఖలా లున్నవి. ఇటీవల 1943 వ సంవత్సరము ఆగస్టు 1 వ తేదీతో కలి యుగం అంతమై కృతయుగము ప్రారంభమగుననే జోస్యం చెపుతూ ప్రకటింపబడిన "చేతావని" అనే గ్రంథంలో వీటి వివరాలున్నవి.

దక్షిణహిందూదేశ చరిత్రలో తిరుమల నాయకుడని ప్రసిద్ధి జెందిన మహారాజమాన్యరాజశ్రీ తిరుమల శౌరి నాయని అయ్యలు గారు, మధుర రాజ్యాన్ని పరిపాలిస్తూ వుండగా 1653 లో ఇలాంటి వదంతులు బైలుదేరి దేశమంతా అట్టుడికినట్టు ఉడికిపోయిందని మధురమండల చరిత్రను రచియించిన నెల్సన్ గారు 1868లో వ్రాశారు. ఇలాంటి వదంతులు బైలుదేరడమే తడవుగా యివి దేశములో వ్యాపిస్తవి. విద్యాగంధము లేని సామాన్య జనులేగాక విద్యావం తులుకూడా ఈ వదంతులను విశ్వసించి ఆందోళన చెందుతూవుంటారు.

బ్రహ్మంగారి తత్వాలు పాడుతూ గ్రామాలవెంట అడు క్కుంటూ తిరిగే బిచ్చగాళ్ళు మనదేశంలో ఇప్పటికీ కనబడుతూ వుంటారు.

కొద్దిరోజులలో ఉత్తరాదినుంచి దేవాంశసంభూతుడైన రాజ కుమారుడొకడు వస్తాడనిన్నీ ప్రస్తుతము అమలుజరుగుతూ వున్న రాజకీయ సాంఘిక మతవ్యవస్థలనన్నింటిని అతడు తారుమారు చేస్తా డనిన్నీ అంతట పాడిపంటలతో తులతూగుతూ శాంతి సౌఖ్యములు కలిగియుండే కృతయుగము ప్రారంభమౌతుందనిన్నీ జోశ్యాలు చెపుతూ వుండే కొన్ని తత్వాలను పాడుతూ చాలామంది బిచ్చ గాళ్ళు 1653 లో మధురా మండలంలోని గ్రామాలవెంట తిరగడం

ప్రారంభించారు. ఈ పాటలలో సూచించబడిన జోస్యాన్ని చాలా మంది నిజమని నమ్మడం ప్రారంభమైంది. ఆ కృతయుగం ఎప్పుడు వస్తుందా అని ప్రజలు నోళ్లు తెరుచుకుని యెదురు చూస్తున్నారు. ఎవరైనా ఇది ఘాటిపురాణమని అనడానికి సాహసిస్తే వెంటనే నలుగురు పెద్దమనుష్యులు ఆమాటలన్న వాళ్లను మందలించి ఇలాంటి విషయాలలో కాదనడం అపచారమని వారించేవారు. దేశమంతటా తిరుగుతూ వుండే సన్యాసులు, గోసాయిలు, బైరాగులు ఈ నమ్మకాలను త్వరలోనే దేశంలో ప్రచారం చేశారు కొందరు నేర్పరులైన మోసగాండ్రు అమాయకులను వంచించి రాబోయే మహాపురుషుడి కోసమని చందాలుకూడా వసూలు చెయ్యడం ప్రారంభించారు.

అంతట యుగపురుషుడు కాబోయే శిశువున్నూ అతని తల్లిన్ని ఉత్తరాదినుంచి బైలుదేరి మధురా నగరానికి వస్తున్నారనిన్నీ బెంగుళూరు చేరుకున్నారనిన్ని ఒకవార్త పుట్టింది. ఆమహానుభావుణ్ని దర్శించి తరించడం ఎప్పుడెప్పుడని ప్రజలు పట్టలేక తల్లడిల్లిపోతున్నారు. ఈ అవతారపురుషుడికి తాఅంతా తప్పకుండా కప్పాలు చెల్లిస్తామని మధురానగరం చుట్టుపట్లవాళ్లగార్లందరూ స్పష్టంగా చెప్పారు. కాని ఆ మహాపురుషుడు రావడం మాత్రం ఎప్పటికప్పుడు వెనక్కి పోతూవుంది. ఈవదంతులు వ్యాపింప జేస్తూవున్న వారు కొందరు గూఢపురాణీచేసి ఒక స్త్రీని శిశువును బెంగుళూరులో ముస్తాబుచేసియుంచి వారిని దర్శించడానికి కొందరిని పంపించారు కొందరు పోతూ వుండడంచూసి ప్రజలలో వేలంవెర్రి పుట్టింది. ఆ సార్వభౌముణ్ని చూడడానికి తండోపతండాలుగా ప్రజలు బెంగుళూరికి పోవడానికి ప్రయత్నమైనారు. ఆసమయంలో బెంగుళూరు ప్రాంతాలను పరిపాలించే మహమ్మదీయు లీ మూఢ ప్రజల దగ్గరనుంచి పోళ్ళీలు వసూలుచేసి వారిదగ్గరనున్న సొమ్మును తీసుకొని కొందరిని వధించి తక్కినవారిని వెనక్కి పొమ్మని నిరోధించారు.

ఇంత జరిగినా ఈ వేలం వెర్రి పూర్తిగా తగ్గలేదు. అవతారమూర్తియైన శిశువు తాత్కాలికంగా పరమపదించినా మళ్ళీ పునర్జీవం పొంది త్వరలోనే అనుకున్న మహాకార్యాలన్నీ సాధిస్తాడని కొందరు

నేర్పరులు. ప్రచారంచేస్తూ మధురానగర వాసులను నమ్మించి వారి వల్ల అనేక విధాలుగా సొమ్ము కాజెయ్యడం ప్రారంభించారు. అప్పట్లో ఆప్రాంతాలలోనుండే పాశ్చాత్యు డొకడు ఈ సంగతులను గురించి ఒకఉత్తరంలో వర్ణించాడు. అయితే వస్తాడనుకొన్న అవతార పురుషుడిపేరు మాత్రం ఆ ఉత్తరంలో నుదాహరించ లేదు ఎప్పటి కప్పుడు ఇలాగ అవతరిస్తాడని ప్రజలనుకునే వీరభోగ వసంతరాయుడే అప్పట్లో వస్తాడనుకున్న యుగపురుషుడై యుంటాడనినీ 1866 నాటికి కూడా విద్యావంతులైన దేశీయులలో ఇలాటి నమ్మకం బాగావ్యాపించి యున్నదనినీ నెల్సన్ గారు వ్రాశారు. *

---

# జోగిపంతులు - తిమ్మజగపతి

మచిలీబందరులో ఇంగ్లీషు వర్తక కంపెనీవారి రాష్ట్రీయ కార్యాలోచన సంఘమువారి సభాపతి పరిపాలనలో చేరిన రాజ మహేంద్రవరం సర్కారు జమీందారులు సాధారణంగా ఏదోపని మీద బందరు వచ్చి ఆ రాష్ట్రీయ సభాపతితో మాట్లాడ వలసి వచ్చేది. 1762 మొదలు 1768 వరకూ జాన్ వైబస్ అనే దొర బందరులో రాష్ట్రీయ సభాపతిగా వున్నాడు ఆయన దగ్గర కాండ్రే గుల జోగిపంతులుగారు ద్విభాషిగా నుండేవాడు. ఆకాలంలో 'పంతులు'గారంటే, జోగిపంతులుగారే. ఈయన చాలా పలుకుబడిని సంపాదించి 1763-65 మధ్య వైబసుగారి తరఫున హైదరాబాదు నవాబు గారితో రాయబారాలు నడిపినవాడు. ఇతడు కంపెనీవారికి చేసిన అమూల్యమైన సేవకు ప్రతిఫలంగా దీవిసీమలోని కొన్ని వూళ్ళలో హావేలీభూముల నీయనకు జాగీరుగా ఇచ్చారు.

జోగిపంతులుగారి తరువాత ఆయన సోదరులైన వెంకటరాయలుగారు బందరులో మరికొందరు రాష్ట్రీయ ప్రధానాధికారుల దగ్గర ద్విభాషిగా పనిచేసి మెప్పుపొంది 1776లో దీవి తాలూకాలోని హావేలీభూము లన్నిటినీ పదేళ్ళకు కవులుకు పొందినాడు. ఆ భూము

---

*[The Madura Country, J. H. Nelson Part III pp. 131.]

లను ఆయన తమ్ముడి కొమారుడైన జగ్గప్పపేర మళ్ళీ కవులిచ్చారు. 1807 వ సంవత్సరములో దివితాలూకాను కాండ్రేగుల జోగిపంతులు గారి మనుమడైన గోపాలరావుగారికి జాగీరుగా యిచ్చారు. ఈ గోపాల రావుగారు 1812 లో చనిపోగా ఆయన చిన్నతమ్ముడు జగన్నాథ రావుగారికిది సంక్రమించింది తరువాత ఆయనవారసు గోపాలరావు దీవి జమీందారుడై తన భార్యకు దత్తత అధికారము నిచ్చి 1836లో చనిపోయినాడు. తరువాత 1853 వ సం॥ మార్చి 25 తేదీన దీవి జమీందారీ వేలము వేయబడి కంపెనీ గవర్నమెంటువారే ఖరీదు చేయడంతో ఈ జమీందారీ అంతరించింది. (Kistna District Manual p 215)

బందరులో నున్న కాండ్రేగులవారి మేడ నిప్పటికీ 'పంతులుగారి' మేడ అని అంటారు. వీరి సంతతివారిప్పుడు రాజమహేంద్రవరంలో సంపన్నులుగానున్నారు.

పైన చెప్పిన కాండ్రేగుల జోగిపంతులుగారు అఖండమైన రాజ్య తంత్రవేత్త. తన నేర్పుచేత రాజులను జమీందార్లను తనకు దాసానుదాసులుగా చేసుకోగలిగినాడు. ఇతణ్ని చూస్తే వారందరికీ చాలా భయం. వీరింటిదగ్గర ప్రతిరోజూ జమీందార్లు పడిగాపులు కాస్తూ పడి వుండేవారు.

క్రమక్రమంగా జోగిపంతులుగారికి ధనము గర్వముకూడా హెచ్చిపోయినవి. అందువల్ల ఆయన అప్పుడప్పుడు రాజులను అవమా నించడం కూడాకద్దు.

పెద్దాపురం సంస్థానాధిపతియైన వత్సవాయి తిమ్మ జగపతిరాజుగారు చాలా తెలివైనవాడు. విద్యావంతుడు. ఆయన వ్యవహారరీత్యా బందరులో రాజుపేటలోవుంటూ వుండేవాడు. వత్సవాయి రాజులు పూసపాటి రాజులు నివసించినందువల్లనే ఆ పేటకు "రాజుపేట" అని పేరువచ్చింది. ఈ రాజులకు గొడుగుపట్టే పరిచారకుడు గాలివానలో చిక్కినట్లున్నూ రాజుగారు ఒకచెట్లగుంపుకింద నిలబడగా అది గొడు గుగా కాచినట్లున్నూ అందువల్ల దానికి "గొడుగుపేట" అని పేరు వచ్చి నట్లున్నూ కూడా ఒక కథ వున్నది.

ఏది ఎలాగున్నా తెలుగు జమీందార్లు రాజులు బందరులో పడివుండి జోగిపంతులుగారి దర్శనంకోసం వేచియుండడం జరుగుతూ ఉండేది. ఆ సందర్భంలో ఒకసారి తిమ్మజగపతి రాజుగారు ఏదో పని వుండి జోగిపంతులుగారి ఇంటికి వెళ్లారు. పంతులుగారు లోపల ఉన్నందువల్ల దర్శనానికి పిలుపు లేక పోయింది. అంతట తిమ్మజగపతిగారు పంతులుగారి కచ్చేరీ చావడిలో పంతులుగారు కూర్చునే తివాచీమీద వారిదిండు నానుకుని కూర్చున్నారు. కొంత సేపటికి పంతులుగారు బయటికి వచ్చి యిదిచూసి కోపోద్దీపితులై 'మర్యాద ఎరగకుండా తన దిండు నానుకొని కూర్చున్నందువల్ల తిమ్మనిం దిమ్మని' చేస్తానని ప్రతిజ్ఞ పలికారు. మహారాజుగారా మాట విని 'సరే జోగిని జోగిని చేస్తాము లెండి' అని వెళ్ళిపోయారు.

తరువాత తిమ్మజగపతిగారు, ఈ జోగిపంతులుగారు రాజులను చేసే అవమానాలను గురించి తోడి రాచవారికీ వెలమవారికీ తెలియపరిచి అక్కడ జరిగిన శపథాలను గురించి కూడా చెప్పి దీనిని గురించి ఆలోచించవలసినదన్నారు. వారందరూ మీరేమి చెప్పితే అది చేస్తామన్నారు. అంతట తిమ్మజగపతిగారు రాజులను సమావేశపరచి తమకు హిందూస్తానీ బాగా వచ్చివున్నందువల్లను ఇంగ్లీషు దొరలతో తాము హిందూస్తానీలో మాట్లాడగలమనిన్నీ ఇకముందు జమీందారులందరూ ఇంగ్లీషు అధికారులకూగల వ్యవహారాలలో జమీందార్ల తరఫున తిమ్మజగపతి రాజుగారి ద్వారానే జరిగించవలసినదనిన్నీ విన్నవింపచేశారు. అందుకు రాష్ట్రీయాధికారి అంగీకరించారు. అంతట తిమ్మజగపతిరాజుగారు బందరులోనే ఉంటూ జమీందారులతరఫున అతిసమర్థతతో ద్విభాషీగా వ్యవహరించసాగినారు. అందువల్ల జమీందారులు జోగిపంతులుగారి దగ్గరికి పోవలసినపని లేకపోయింది. అంతట జోగిపంతులుగారికి ఇదివరకు వచ్చే ఆదాయము సన్నగిల్లింది. ఉద్యోగ హోదాలు కూడా తగ్గిపోయినవి. ఆయన కొన్ని చిక్కులలో చిక్కుకున్నారు. ఆకారణంవల్ల జోగిపంతులుగారు తిమ్మజగపతిగారిమీద పగవూని ఆయనను చంపడానికి ప్రయోగం చేయించారట. అప్పుడు తిమ్మజగపతిగారు కూడా తమ మంత్రవేత్తలచేత దానిని త్రిప్పికొట్టగా అది జోగిపంతులుగారినే చంపినదట.

తిమ్మజగపతిగా రిలాగ జమీందారుల ప్రతినిధిగా ఇంగ్లీషు అధికారులతో వ్యవహారాలు జరపడంవల్ల ఆయనకు పలుకుబడి ఎక్కువై పెద్దాపురంలో ఆయన దర్బారులోకి చాలా మంది రాజులు వస్తూవుండేవారు. ఆయనను గురించి చాలా కథలు చెప్పుకుంటారు.*

---

## టిప్పూసుల్తాన్ చేయించిన జపం

పూర్వం హిందూరాజులు చేయించినట్లే తురకనవాబులు కూడా తమ యిష్టసిద్ధికోసం జపాలుచేయిస్తూ వుండేవారు. బ్రాహ్మణులచేత జపాలు హోమాలు చేయించడంలో (1761-82) మధ్య మైసూరును పాలించిన హైదరాలీకి మంచినమ్మకం వుండేది. అతడికి హిందువులు విశ్వసించే అనేక విషయాలయందు నమ్మకం వుండేది. అశుభ శకునాలు రిక్షరేకులు, పూజలు, పురస్కారాలు పూర్తిగా విశ్వసించేవాడు. అనేక దేవాలయాలకు మొక్కుబళ్లు చెల్లించాడు. దానధర్మాలిచ్చాడు. ఇప్పటికీ అతడిచ్చిన వస్తువాహనాలు, కట్టినగోపురాలూ కనబడుతున్నాయి.

1782-1799 మధ్య మైసూరు నేలిన టిప్పూసుల్తానుకు హిందువుల ఆచారాలమీద అంతగా నమ్మకం లేదు. బ్రాహ్మణులంటేకూడా ఎక్కువ గౌరవం లేదు. అయినప్పటికీ తనమీదకి శత్రువులు దండెత్తి వచ్చినప్పుడు మాత్రం బ్రాహ్మణులచేత జపాలు చేయించేవాడు.

జపదీక్షవహించి భోజనాలుమాని. పాలుఫలహారాలు మాత్రం ఆరగిస్తూ నియమంగా వుండే బ్రాహ్మణులు పదిమందిగాని, నూరుమందిగాని కావేరినదిలోనో పెద్దచెరువుల్లోనో రొమ్ముబంటిలోతు నీళ్ళలో నిలిచి మంత్రాలు చదువుతూ తమ చేతులతో ఉదకాన్ని స్పృశిస్తూ సుల్తానుగారికి యిష్ట సిద్ధికలగాలందులకని తదేకనిష్ఠతో జపంచేస్తూ వుండేవారు. ఇలాంటి జపం చాలాసార్లు జరిగినట్లు చరిత్రకారులు వర్ణించారు.

---

* బ్ర॥ శ్రీ॥ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి పెద్దాపుర సంస్థాన చరిత్ర విమర్శనము.

గవర్నరు జనరలైన కారన్‌వాలీస్ శ్రీరంగపట్నంమీాదికి రెండుసార్లు స్వయంగా దండయాత్రకు వెళ్ళినప్పుడు టిప్పూసుల్తాను బ్రాహ్మణులచేత ఇలాగ జపంచేయించాడు. ఆ రెండుసార్లూ కారన్‌వాలిస్ వెనుకకు పోవలసివచ్చినందు కీ జపమహాత్యమే కారణమని అన్నారు. తరువాత మళ్ళీ జనరల్ హారిస్ శ్రీరంగపట్నం మీాదికి వచ్చినప్పుడు కూడా ఇలాంటిజపం చేయించినా టిప్పూసుల్తానుకు అపజయము కలిగింది. దీనికి కారణం ఈజపం చేయించిన పురోహిత బ్రాహ్మణుడిలో ఏదోలోప మున్నందువల్లనే నని కొందరన్నారు.

---

# మహమ్మదాలీ చేయించిన మారణహోమం

బ్రాహ్మణుల జపాలయందూ మంత్రబల మందూ ఈ దేశపు తురకలకుకూడా విశ్వాసముండడాని కిది యొక్కటే దృష్టాంతము కాదు. ఇంకా చాలా ఉదాహరణ లున్నవి.

1749 మొదలు 1795 వరకూ ఆర్కాటు నవాబుగా నుండి ఇంగ్లీషువారికి స్నేహితుడై యుండిన మహమ్మదాలీ వాలాజా నవాబుకు కూడా ఇలాంటి నమ్మకం ఉండేది. చెన్నపట్నంకోటకు గవర్నరుగా నుండిన పిగట్టు తంజావూరు రాజ్యాక్రమణవిషయంలో నవాబు ఆటలు సాగనివ్వడం లేదని నవాబుగారికి కార్పణ్యం కలిగింది. అందువల్ల పిగట్టుగారిని పరిమార్చడానికని నవాబు ఐదువేల నవరసులు ఖర్చుపెట్టి అచ్చన్న పండితులనే బ్రాహ్మడిచేత ప్రయోగం చేయించాడట. అంతట పిగట్టు 1776 లో పదభ్రష్టుడై చెరలోనే మరణించాడట. ఇలాగే మహమ్మదాలీ హైదరాలీతో యుద్ధంలో నిగ్రహించ లేక పగపట్టి అతన్ని పరమార్చడంకోసం కూడా జపాలు చేయించాడట.

బ్రాహ్మణులచేత జపతప హోమాదులు, మంత్రతంత్రాలు, చేయించడమే గాక మహమ్మదీయులలో కొందరు స్వయంగాకూడా యిలాంటి జపాలను మారణహోమాలను చెయ్యడం నేర్చుకుని ప్రయోగించే వారట.*

---

*Historical Sketches of South of India-Col. Mark Wilks. (1810.) p 55

ఠార్చింది. "టాప్సీ నీవిలాగ అనడం ఎందుకు? మనకందరికీ రక్షకుడైన ఈశ్వరుడు నిన్ను చూడడంలేదా? సమస్తప్రాణులపైన దయజూపే ఆత నికి నీపైన ప్రేమలేదా ?.' అని మెల్లిగా దీనముగా పలికినది. టాప్సీ తెల్లపోయింది. ఈశ్వరప్రేమ, దయ ఎలావుంటాయో ఆమెకిదివరకు తెలియలేదు. ఈవా మరింత దీనముగా "టాప్సీ! నీపైన నాకు ప్రేమ ఉన్నది. నా కానందము కలిగించడాని కైనా నీవు బాగు పడాలి!" అన్నది. టాప్సీ తన పెద్ద కన్నులలో నుండి అశ్రువులు రాల్చింది. ఆమెహృదయము కరిగింది. ఒక్కమారుగా ఆమెకు ఆశా జ్యోతి, ఆత్మజ్ఞానవికాసము, కలిగినవి 'అమ్మా నేను బాగుపడడానికి ప్రయత్నిస్తా'నని వాగ్దానము చేసింది. ఈదృశ్యమును అగస్టైను చూచి ఒఫీలియాకుచూపించినాడు. ఒఫీలియాఆశ్చర్యపడింది. "ఓహో! ఈశ్వర మాయ! ఆపిల్లను ముట్టుకోవడం నాకు అసహ్య మనే సంగతి దాని కెలాగ తెలిసిందో! నిజముగా నీ నీగ్రోపిల్ల కెంత బుద్ధిసూక్ష్మత వివే చనఉన్నవి!" అనుకుంది ఈవాయొక్క కరుణ టాప్సీయం దత్యద్భుత మైన మార్పును కలిగించింది. వికటహాసము, వక్రవర్తనము, అసత్య ములు తప్ప ఇతర పద్ధతులెరుగనిపిల్ల, మెల్లిమెల్లిగా వానిని మానింది.

ఈవాకు జబ్బు హెచ్చినది. టాము ఆమెను కన్నబిడ్డవలె లేవ నెత్తేవాడు. పంచపాళీక్రింద కుర్చీలో కూర్చుండబెట్టేవాడు. ఒఫిలియా ఆమెకెన్నో పరిచర్యలనుచేసేది. కాని లాభములేకపోయింది. ఈవా మంచముపట్టింది. ఒఫీలియాతోపాటు టాము రాత్రింబవళ్ళు మేల్కొని ఈవాకు పరిచర్యలు చేస్తున్నాడు. ఒకనాడు టాప్సీ కొన్ని పువ్వుల గుత్తులు కట్టి ఈవాకోసం తెచ్చింది. ఈవా తల్లి యామెను కసరి కొట్టింది. టాప్సీ గుడ్లనీరు గుక్కుకొన్నది. ఈవా ఇదిచూసి ఆమెను తనమంచము దగ్గిరకిబిలిచి 'ఓహో! ఈ పూలగుత్తు లెంత బాగున్నవే! అనుదిన మిట్టివానినే నీవుతెచ్చి నాపువ్వు మంజూషయందు పెడుతూ వుండు" అంది. ఈమాటలువిని టాప్సీ పరమానందముపొందింది. కొద్ది రోజులలో తాను ఈశ్వర సాన్నిధ్యము జేరుతానని ఈవా గ్రహించి తన శిరోజములను కత్తిరించి తన తండ్రి బానిసల నందరిని దగ్గరకు పిలిచి తన జ్ఞాపకార్థముగా ఒక్కొక్కరి కొక్కొక పాయ నిచ్చింది.

వాగుకన్నుల నీరుకారుస్తూ వాటిని పుచ్చుకున్నారు. టాప్సీ మెల్లగా భయపడుతూవచ్చి అమ్మా నేను దుర్మార్గురాలనని నాకు తెలియును కాని నాకు కూడా ఒకపాయనియ్యవా? అని చేయిజాచింది. ఈవా కన్నీరునించుతూ టాప్సీ! అవశ్యముగా ఇస్తాను. ఇదిగో తీసుకో అని యిచ్చింది. ఈవా తానుమరణించిన తరువాత టామును బానిసతనము నుండి విముక్తిచేయమని తండ్రికి చెప్పి చేతిలో చేయి వేయించికొంది. ఈవా యొక్క దయార్ద్రహృదయము మరింత కరుణార్ద్రమైనది. ఈ సుగుణమణిదివికేగే టప్పుడు స్వర్గ ద్వారములు తెరుస్తారనిన్నీ అప్పుడు తానీశ్వర దర్శనము చేసి తరిస్తాననిన్నీ టాము ఒఫీలియాతో అన్నాడు. "ఆహా! యీ నల్లనివాని కెంత ఆత్మానాత్మ వివేచనశక్తి ఉన్నది!" అనిఒఫీలియా ఆశ్చర్యపడింది. ఆరాత్రే ఈవా మరణించినది. ఇంటనున్న వారికందరికీ అమితమైన దుఃఖము కలిగింది. ఆనాడు టాప్సీ గుండె పగులునట్లు ఏడ్వసాగింది. 'అయ్యో నామీద దయ ప్రేమకల ఈ యమ్మయొక్కతేనన్ను వీడిపోయినది.' అని కన్నీరు మున్నీరుగా యేడ్వసాగింది. ఈమె దుఃఖాన్నిచూసి ఒఫీలియాకు జాలికలిగి 'టాప్సీ! నీపైన ఇంకముందు నేను దయగావుంటాను విచారించకు' అని ఎంతో ఓదార్చింది. ఆనాడుమొదలు టాప్సీ మరింత బుద్ధిమంతు రాలయింది. అగస్టైను దుఃఖమునకు మేర లేదు. టాముఅతనిని ఊరడిస్తూవుండేవాడు. ఒకరోజున ఒఫీలియా అగస్టైనుతో "ఎందుకైనా మంచిది. టాప్సీనినాకు దానముచేసి ఒకపత్రము వ్రాసియియ్యి. దానికినేను విద్యచెప్పి వదలేస్తానని కోరింది. అగస్టైనట్లే వ్రాసియిచ్చాడు. అగస్టైను టామును బానిస తనమునుండి విముక్తి చేయడానికి అవసరమైన కార్యక్రమమునకు పూనుకొన్నాడుగాని ఆవ్యవహారములోని గుంటచిక్కులు తీరకముందే అగస్టైనుకు ఆకస్మిక మరణము తటస్థించిది. ఆతడు టాము నీశ్వరస్మరణము చేయుమనికోరి అతని చేతులలోనే ప్రాణములు విడిచాడు. అగస్టైనుభార్య మేరీ యజమాను రాలైంది. ఆమె భర్తవంటిది కాదు. బానిసలయెడల నామెకు సానుభూతి లేదు. దయాదాక్షిణ్యములు లేవు.

## "హైదరులింగము"

క్రీ. శ. 1761-1782 మధ్య మైసూరు రాజ్యాన్ని పరిపాలించిన హైదరాలీ బహద్దరుగారు హిందువుల దేవాలయాలకు మొక్కుబళ్ళు చెల్లించినట్లు చాలా నిదర్శనములు కనబడుతున్నవి.

మైసూరులో నంజనగూడులో నంజుండేశ్వరాలయం అనే ఒక గొప్ప దేవాలయం ఉంది. ఆ దేవాలయంలో తన పేరుతో ఒక లింగాన్ని ప్రతిష్ఠించ వలసిందని హైదరాలీ అక్కడి స్థానాపతులను కోరి కొంతసొమ్ము ఇచ్చినందువల 'హైదరులింగం' అనే లింగాన్ని ప్రతిష్ఠించారు. ఈ లింగానికి ధూపదీప నైవేద్యాలకోసం హైదరాలీ చాలా సొమ్ముఇచ్చి దేవాదాయాన్ని యేర్పాటు చేశాడు.

---

## హైదరాలీ కట్టించిన దేవాలయ గోపురం

మైసూరు రాజ్యంలో శ్రీరంగపట్నంలో నున్న శ్రీరంగనాథ స్వామివారిదేవాలయుం చాలా పురాతనమైనది. దీని గోపురం చాలా గొప్పది. మైసూరు రాజ్యాన్ని హైదరాలీ, టిప్పుసుల్తానులు ఏలిన కాలములో కూడా ఈ రాజు లీదేవాలయానికి ఎలాంటి హానికూడా కలుగకుండా కాపాడారు.

ఈ దేవాలయానికి కొంత దూరంలో హైదరాలీ సర్కారు వారి ఫిరంగులు మొదలైనవాటికి కావలసిన మందుగుండు సామానుు తయారుచేసే కార్ఖానా యుండేది. ఒక మారు ఆ కార్ఖానాకు నిప్పు అంటుకుని బ్రహ్మాండం ఒద్దలు అయ్యేటంత చప్పుడుతో పేలింది. ఆ అదటుకి దగ్గరలోనున్న రంగనాథస్వామివారి దేవాలయ గోపురం విరిగి కిందపడింది. అప్పుడు మైసూరు రాజ్యాన్ని ఏలుతూవున్న హైదరాలీ వెంటనే తన సైనికులను పంపి వాళ్ళచేతనే ఆ గోపురాన్ని మళ్ళీ కట్టించాడు।

---

# హైదరాలీ స్వామివారికిచ్చిన రత్నహారం

ఒకమాటు హైదరాలీకి చాలా ప్రియమైన ఒక ఏనుగుగున్నకి కంటిజబ్బుచేసింది. ఎన్ని మందులు వేసినా నయం కాలేదు. కన్ను పోతుందన్నంతభయం కలిగింది ఎవరో నంజుండేశ్వర స్వామికి మొక్కితే జబ్బు కుదురుతుందన్నారు. సరే మొక్కుకోమన్నాడు హైదరాలీ కొద్ది రోజులలోనే జబ్బుకుదిరింది. అప్పుడు హైదరాలీ సంతోషంతో నవరత్నాలు పొదిగిన హారాన్ని దేవుడికి సమర్పించాడు.

---

# చాముండేశ్వరికి సుల్తానుగారి ఆభరణాలు.

మైసూరు నగరంలో ఒక కొండమీద వెలసిన చాముండేశ్వరికి హైదరాలీయున్నూ ఆయన తరవాత మైసూరు రాజ్యం ఏలిన ఆయన కొమారుడు టిప్పూసుల్తానున్నూ కూడా చాలా విలువగల ఆభరణాలూ, వస్త్రాలూ సమర్పించారు. ఇప్పటికీ దేవికి అలంకారం చేసేటప్పుడు ఆ ఆభరణాలు, వస్త్రాలు తొడుగుతారు.

---

# టిప్పూసుల్తాన్ - శృంగేరీ శంకరాచార్యులవారు

హైదరాలీ తరువాత ఆయన కొమారుడైన టిప్పూసుల్తాను 1782 మొదలు 1799 వరకూ మైసూరు రాజ్యాన్ని ఏలినాడు. హైదరాలీ టిప్పూసుల్తానులు ఇద్దరూ తమ రాజ్యంలో చేరిన శృంగేరీ మఠాధిపతియైన శంకరాచార్య స్వామివారిని గౌరవించేవారు. ఒకమాటు మరాటీదండు శృంగేరీ మీదపడి ఆయూరినీ ఆమఠాన్నీకూడా దోచుకున్నారు. అప్పుడు ఆ స్వాములవారికీ వారి శిష్యులకూ అన్నవస్త్రాలకే కరువైంది. ఈ సంగతి టిప్పూసుల్తాను వారికి తెలియగానే వారికి ఆహారపదార్థాలూ బట్టలూ కొంత రొఖమూ పంపించి మరాటీదండు మళ్ళీవచ్చి పడకుండా కాపుదలకోసం కొంత సైన్యాన్ని కూడా పంపించారు. ఈ సందర్భంలో శృంగేరీస్వామి వారికీ టిప్పూసుల్తాను వారికీ జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు ఇప్పటికీ వున్నాయి. వీటివల్ల ఈ తురకరాజు హిందూమతాచార్యుల పట్లఎంత మర్యాదతో ప్రవర్తించినదీ తెలుస్తుంది.

# సవరణలు



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 40 | 28 | Laquered | Lacquerd |
| 51 | 20 | డైరెక్టరిల | డైరెక్టరుల |
| 56 | 3 | టనును | సీటనును |
| ,, | ,, | ఉంచారుగాని | ఉంచారు. |
| 63 | 19 | వాళ్లని | వాళ్లు |
| 96 | 17-18 | 20 లక్షల తొంబైవేల | కోటి తొంభైలక్షల |
| 99 | 6 | బ్రహ్మ. | సూత్ర, బ్రహ్మ, |
| 116 | 29 | నారికి | వారు |
| 117 | 20 | సాళుర | సాళువ |
| 117 | 25 | వేటపాలెం | వేలుపాలెం |
| 119 | 23 | కార్యాలయములను | కావ్యములను |
| 120 | 16 | కొండవీటిని | గోలకొండను |
| 125 | 1 | కాపోర్ప్రా | కొపోర్ప్లలు |
| 143 | 10 | యాచక | యాచన |



అగస్టైను టామునకు బానిసత్వ విమోచనము చేయదలచినాడనిన్నీ ఈవా కతడుచేసిన వాగ్దానము చెల్లించవలసినదనిన్నీ, ఒఫీలియా మేరీకి చెప్పినా లాభము లేకపోయినది. తక్కిన బానిసలతోపాటు టామును కూడా వేలము వేసేవారి అంగడికంపి వచ్చిన క్రయధనము మేరీ మూటకట్టుకున్నది.

వేలము వేసేచోటు నాగరకమైన పశువుల సంతలాటిది. అక్కడ వేలము జరిగేముందర నీ బానిసలకు ముస్తాబుచేస్తారు. యజ్ఞపశువులలాగ మేపుతారు. వీరిని కొనవచ్చినవారు వీరిని పట్టి తడవి చూస్తారు. స్త్రీయొక్క అవయవాలనుకూడా తడవుతారు. అన్నిటికీ వీరు ఓర్చుకోవాలి. వారియెదుట వీరుచలాకిగా సంతోషంగా ప్రవర్తించాలి. అందకత్తెల కధికధనము వస్తుంది గనుక వారు ముస్తాబుచేసికొని ఒయ్యారముగా నుండాలి. లేకపోతే తిట్లుదెబ్బలు తప్పవు. టాముతోపాటు విక్రయింపబడిన వారిలో ఎమ్మెలైను అనే చక్కనిచుక్క పదునైదేండ్ల యువతీమణియున్నది. ఆమెను తల్లినుండి విడదీసి వేలము వేశారు. ఈ తల్లి బిడ్డ లేమిచేయ గలరు? గుండె లవియున ట్లేడ్చారు. దైవవశమువల్ల టామున్నూ, ఎమ్మెలైనున్నూ, లూసీ అనే యింకొక స్త్రీయున్నూ "లెగ్రీ" అనే ఒక క్రూరుని పాలబడ్డారు. లెగ్రీ మోటు మనిషి. కఠినహృదయుడు. అతడు ఎమ్మెలైనును తన కామము కొరకే కొన్నాడు. టాము సహజముగా శుభ్రమైన దుస్తులు ధరించియున్నాడు. బానిసలకు శుభ్రమేమిటి? ఇన్ని బట్టలెందుకు? అని లెగ్రీ పలికి ముందుగా వాని జేబులు వెదకి ఈవా నాడించడానికి దాచియుంచిన ఆట వస్తువులను నదిలో పారవేశాడు. వాని బట్ట లూడదీయించి ఒక చింకి చొక్కాను ఒక చిరుగుల లాగునిచ్చి "జాగ్రత్త; ఈ జత ఒక సంవత్సరం వాడుకోవాలి"అన్నాడు. టాము పైబట్టలను అతని పెట్టిలోని బట్టలనుకూడా ఓడలో వేలము వేసి ఆ సొమ్మును లెగ్రీ మూటకట్టుకొన్నాడు. టామొక చిన్న బైబిలును మాత్రము ప్రాణప్రదంగా దాచుకొన్నాడు. "ఒరే టామూ! నీవేమో ఏసుక్రీస్తు మతము పుచ్చుకొన్నట్లు నాకు తెలిసింది. ఇక ముందు నేనే నీకు దేవుడను. నామతమే నీవు స్వీకరింపవలెనని హిరణ్యకశిపునివలె లెగ్రీ హెచ్చరించాడు.